పి ఠా పు ర ము

శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాల

1930—2.

# ప్రేరకం.

విద్యార్థుల కుపన్యాసరూపమున విషయమును బోధించుటకంటెఁ గథారూపమున బోధించుట సులభముగానుండును. అట్టికథలను గ్రొత్తగ వ్రాయుటకంటెఁ బూర్వకవుల కావ్యములలోని కథలను బోధించుటవలనఁ గావ్యగుణములం దధికగౌరవము గలుగఁగలదు. కావునఁ బూర్వకవులగ్రంథములలోనుండి మిక్కిలి నీతికథలు విద్యార్థుల కధికోపయోగకరంబులుగా నుండునని యెంచి యేర్చి కూర్చి ప్రకటించితిమి. విద్యాధికారులు మాయుద్యమము నాదరింపవలయునని కోరుచున్నాము.

ప్రకాశకులు.

# నీతికథావల్లరి

## ప్రథమభాగము.

### ౧ చదువుకొన్న మూర్ఖుఁడు.

క. గార్గ్యుఁ డను విప్రుఁ డొకఁడు
దుర్గారాధనముఁ బెక్కుదోసఁగులఁ బడుచున్
దుర్గాటవిలోఁ జేయ ని
ర్గళగతిఁ దన్నుఁ జూచి యాయంబికయున్. 1

క. వర మడుగు మనిన మ్రొక్కుచు
సరభసముగ కాంక్షతోడ సంజీవని ని
ర్భరకరుణ నాకొసఁగుము
పరమేశ్వరి యనినఁ గొన్ని పచ్చనియాకుల్. 2

చ. తలఁచినమాత్ర నాత్మకర
తామరసంబున నున్న వాని ని
మ్ములఁ గృపసేసి వీని రస
ముం బయిపైఁ జిలికింపఁగా శవ

మ్మలకును బ్రాణముల్ గలుగ
ముందటిరూపము వచ్చి తేజముం
బలమును జెంది పూర్వగుణ
భంగిఁ జరించుట కల్గు నెల్లెడన్. 3

క. ఎండవు తఱుగ వచుచు నిడి
చండిక పొడఁగానరాక చనుటయు మదిలో
నిండిన సంతసమున వి
ప్రుం డవికొని యాత్మపురము తోవినాకరుఁడున్. 4

చ. చనునెడ నిర్మనుష్య మగు
చక్కటి వప్పెనుగాన నెండిపో
యిన యొకపుండరీకశవ
విహారము వెల్పల నున్నఁ జేరఁగాఁ
జని తనకన్నయౌషధము
శక్తి నిజంబుగఁ జూడ నెంచి చే
త నలఁపి యాకులం బసరు
దానిపయిఁ బిడిచెం గుబుద్ధి యై. 5

చ. పిడిచిన నేమిచెప్ప నతి
భీకరమస్సహాపుండరీక మ
ప్పుడ తన నిద్ర మేల్కనిన
పోలిక ప్రమోగుచు బిట్టు లేచి యు

వ్యోడఁ గగువిప్రుఁ గూయిడఁగఁ
　　జేసి మృతుం బొనరించి మ్రింగె మే
ల్వడసియు బుద్ధిచాలనియ
　　భాగ్యులు తత్ఫలమందనేర్తురే.

క. మఱియు కళాకృషిబీజము
మఱియు తనఫలప్రదక్షమాజము తలఁపన్
మఱియు చెలి మఱియు చుట్టము
మతిహీనులు చూడ మొఱకుమ్రాఁకులు ధాత్రిన్. 7

---

## ౨. పోరునష్టము.

క. నర్మదతటమున హింసా
కర్మం బొరు లెఱుఁగకుండఁ గాఁపుర ముండున్
ధర్మమునఁ జరించు కపట
ధార్మిక మొక్కపులి యొక్కతరుకుంజమునన్. 1

వ. ఇట్లు వర్తింపుచుండ నొక్కనాఁ డవ్వనంబున మృగంబు
లెల్లఁ బెద్దయు సన్నుతిమ్ముఁ బరిపాలించుట పేఁడెన నది
యును హింసాధర్మంబున దంభవం బొనరింపంగాని న్యా
[illegible] బుద్ధి [illegible] పెమ్ముద్ర [illegible] భంగి శిక్షిం

పంగలవాండ ననియె వ్విధం బ్లు చెల్లుమండ నొక్క-
నాండు. 2

క. ఒక్కయెడం దమలో నొక
బొక్కకు వా దడిచి శశకముం గపింజలముం
గ్రక్కునం బఱతెంచి పులికి
మ్రొక్కుచు నిజవాద మిరువురుం జెప్పటయున్. 3

వ. ఆవ్యాఘ్రంబును వానితోడ. 4

గీ. ముదిసినారము కానము మున్నువోలె
శ్రవణములు దూరమును వినుశక్తి లేదు
కదియం జనుదెంచి చెప్పుండు కార్యమనుంకు
నవియుం దేకువతూలి డాయంగ నదువ. 5

క. ముందటికాళ్ళం గొని యా
కుందేలుం గైదుం బట్టికొని గొంతుక నం
దంద కఱచి భక్షించి య
మంద ప్రీతిం బులి శౌర్యమత్తమై యుండెన్. 6

క. అలంతు లగు కార్యములు ఘన
ములు సేసి చలంబుపేర్మిం బోరంగ నది రా
జులచెంతులం బడ్డ నిరుదెఱం
గులవారికిం జాల గీడగుట సందియమే. 7

## 3. అకారణకలహము, ఆత్మవినాశము.



క. ధరణిపయి లాటనరపతి
పురిఁ దేనియ నమ్ముకొనెడు బోయలపల్లెం
జరియించుచుండువాఁ డొక
పురుషుం డది యొక్కకలశమునఁగొని కడఁకన్. 1

వ. అరిగి యానగరంబున నొకసన్నపు వీథియందు. 2

ఉ. తేనియకుండ మోచికొని
దిక్కులు నాలుగు బిక్కచూడ్కి నే
దేనియుఁ జూచుకొంచు నొక
యేనిక కట్టెదుటన్ మదాంధమై
రా నచటం దొలంగెడు పు
రంబుజనంబును జూచి భీతుఁడై
దానును నుత్తరించుచుఁ బ
దంబులు తొట్రుపడంగఁ బాఱుచున్. 3

గీ. వడఁకుఁ గొని నిలువఁ ద్రొక్కని యడుగు కొంత
జాటి ముగ్గతిలంబడఁ బాఱుటయును
నిండి మూఁపునఁదాల్చిన కుండ తొలఁకి
యొలికె మధుబిందు వొకకొంత యుర్విమీఁద. 4

సీ. ఆతేనెబొట్టున కచట నీఁగలుముసి
రిన వానిఁ బట్టంగ నవి కడంకఁ
జేరె నచ్చటి కొక్క చెలఁది, యాచెలఁది మ్రిం
గిన బల్లి నొకపిల్లి దినియె, నంత
నాపిల్లిఁ గఱచె రాజాధీన మగువేట
కుక్కయొక్కటి, దానిఁ గోప మడరఁ
బొడిచె బిడాలంబు, నొడయనినగరికు
క్కలవారు చంపిరి కడఁగి దాని

గీ. దాని వాడవారు తవిలి చంపించిరి
కుక్క, నంతఁ గినిసి కుక్కవేఁట
కాండ్రు రందఱేఁగి కత సవిస్తరముగ
నృపతితోడఁ జెప్ప నృపతి యలిగి. 5

మ. తగ వూహింపక యూరివాడప్రజలం
దాఁ జంపఁగాఁ బంచినన్
జగతీవల్లభుఁ డైననేమి యని యు
త్సాహించి సన్నద్ధులై
నగరం గొల్వనివార లొక్కదెసనై
నానాయుధోపేతులై
తెగి భూపాలకసేనఁ దాఁకిరి మహో
ద్రేకంబుతో నార్చుచున్. 6

ఉ. రెండుతెలుంగుమూఁకలును
రిత్తకు రిత్త చలంబుపెంపునన్
భండన ముగ్రభంగుల నొ
నర్పఁగఁ బెక్కులు దొర్లెఁ బీనుఁగుల్
కండలుఁ బ్రేవులుం గలసి
కాలువలై యొసలారె నెత్తురుల్
కుండలచారుమస్తములు
కుప్పలుగట్టె పురంబువీథులన్. 7

వ. అట్లగుటం జేసి. 8

క. కడుసన్నపుఁగార్యము నె
క్కుడురోసముతోడఁ బెనఁగి కుమతులు మహాగ్రహం
బుడుఁగక పెద్దయు సేగిం
బడుదురు దుమి లాటనృపతిపాండులు వోలెన్. 9

---

౮. దుర్జనునిదూరముచేయవలయును.



సీ. ఒకపర్వతముమీఁద నొప్పెడుకొలనిలో
నంచలు కొన్ని యిచ్ఛానువృత్తిఁ
బగ లెల్ల విహరించి భానుఁడు గ్రుంకంగఁ
బాపాత్ములకుఁ జేరఁ బ్రాకరని

యున్నతోన్నతమగు నొకగండశిలయందు
రే లెల్ల సుఖలీలఁ గ్రాలుచుండు
నట్లుండఁ దద్గ్రహణాపేక్ష నొకబోయ
తెంకిపట్టరసియుఁ దేఱిచూడ

గీ. లేక యరిగెను నొకనాఁడు కాక మొకటి,
ప్రొద్దుగ్రుంకిన నచటుగాఁ బోయిపోయి
ఖగనినాదము విని వానిఁ గదియవచ్చి,
యుండుటయు దానిఁ గని హంసయూథ మెల్ల. 1

ఉ. ఎచ్చటనుండి యెచ్చటికి
నేఁగెద వేమిప్రయోజనార్థమై
యిచ్చట నిల్చి తీవనిన
వేఱి తినంజని కుక్షినిండఁ గాఁ
జెచ్చెర నున్కిపట్టునకుఁ
జేరఁగబోయెడిప్రొద్దు లేమి నా
కిచ్చట నుండఁగా వలసె
నిట్టిది నావిధమంచుఁ జెప్పెవన్. 2

క. అనుఁగాక నిలువు మని హం
సగణం బంతయును బలుక సంకటపడుచున్
సుగుణుఁడు మతిమంతుం డను
తగ వెఱఁగినయంచ యొకటి దా నిట్లనియెన్. 3

గీ. సభము నెంగిల్లు దీనిభోజనము కూరి
మిట్టిమెగ్గులు వేయును నేలచెప్ప
ఖగములందుఁ జంఘాలుఁడు కాకమనుట
కదుఁబ్రసిద్ధంబుగాదె యూనొడుపువినరె. 4

క. వల దీరే యిది మనకడ
నిలిచినఁ గీడొందు మనల నేఁ డెల్లిటిలో
పలఁ జేరకున్నఁ గాలము
తలనైనను జేరు నింత తథ్యము సుండీ. 5

వ. అనుటయుఁ గార్యం బెఱుఁగనితరుణమరాళములు కొన్ని
యమ్మతిమంతునుద్దేశించి. 6

గీ. ఇంతవల్దువాద మీకాకి యొక్కటి
యొక్కరాతిరిచట నున్నమాత్రఁ
గీడు సేయ ననుచుఁ గీనువగొట్టుట
యిద్దివెఱపు గాక యెఱుక యగునె. 7

క. పెక్కులు బుద్ధులు గఱచిన
నెక్కుడు భయమనుట నిక్కమింక బహూక్తుల్
తక్కు మిదియుఁగా కిది తా
నెక్కడికిం బోవుఁ దిమిర మిప్పుడు రాఁగాఁ. 8

క. అని పలికి దాని నుండం
బనిచి యభీష్టంబు లైనఫలములచే భో

జనమొనరింపఁగ నుండఁగఁ
దనయిమ్ముల వాయసంబు దగ నివసించెన్.
వ. ఇట్లు వసించి. 1
సీ. అచట రెట్టఁబెట్టి యఱ్ఱోఁడయము గాఁగఁ
దడయకరిగెనంత దానిరెట్ట
శిలలసంధిఁ బొంద మొలచె నం దొకవట
భూజఫలములోని బీజముండి. 1
మ. అది నానాఁటికిఁ బెర్చి శాఖల విహా
యస్స్పర్శమై యుండఁగాఁ
బవియేండ్లం జనునంత నూడలు కడుం
బల్వారి వర్ధిల్లుచుం
గదిసెన్ వచ్చి యధిత్యకాతలమువం
కన్ మాఱినఁదాఁ బాఱఁకి య
భ్యుదితానంది కిరాతుఁ డొగ్గె నురు లా
భూజంబునం దెల్లెడన్. 12
చ. ఉరులు కుజంబునం గలయ
నొగ్గి నిషాదుఁడు చన్నమీఁద భా
స్కరుఁ డపరాద్రిఁ జేరె జల
జాతవనంబులఁ గ్రీడ మాని స
త్వరగతి మీఁటి మీఁదికి సి
తచ్ఛదముల్ చనుదెంచి యాఁగి పా

గురికలఁ జిక్కి యన్నియును
గుందుతజిన్ మతిమంతుఁ డిట్లనున్. 13

మ. మన కీపాటులు వచ్చెఁ జూచితిరె నా
మాటల్ వృథాహంకృతిన్
వినఁగా నొల్లక యల్లరాత్రి యుచటన్
మీరెల్ల వాచాడి యుం
చిన యాకాకము రెట్టలో మొలిచి హె
చ్చెం జూవె యీమఱ్ఱి డి
గ్గిన యాయూడలఁ బ్రాఁకి కాదె మన కొ
గ్గెం బోయఁ డీజాలమున్. 14

క. తగువానిపలుకు సేయుట
తగ వెఱుఁగక యడిచిపడమి తమవారలతో
సగుణత్వము గాను ఉత్తము
లగుణము లటు గామి యధములగుణము లరయన్. 15

చ. అనవుఁడు నంచ లిట్లను మ
హాత్మ భవత్ప్రతిభావిలంఘనం
బున మన కిట్టికీడిపుడు
పుట్టె నుపాయము కల్గెదీనిఁ బా
పనలవియేనిఁ బాపి హిత
బంధుల నిన్నునుఁ గాచికొమ్ము నీ

పనిచినయట్లచేసి భట
భావముఁ బొందెద మెల్ల వారముల్. 16

వ. అనుటయు మతిమంతుం డిట్లనియె—పరస్పరవశ్యు లగు బంధువు లాపద గడవవచ్చు నింకనైన మదీయవచనంబు లంగీకరించెద రేని వినుం డని మతిమంతుం డిట్లనియె. 17

సీ. కంఠమూలంబునఁ గదిసినయ్యురియుకు
లూడిచికొనిపోవు యుక్తి లేదు
గాని చావక యుండఁ గల దుపాయం బైక
మత్యంబు గలిగిన మనకు నెల్ల
నెట్లన్న నిజ్జాల మొడ్డినవేఁటకాఁ
డే తెంచు నిందుకు వే తడయక
యప్పుడు మన మెల్ల నపగతప్రాణుల
కరణి నుండినఁ జాలు; నురులఁ బాపి
గీ. చచ్చినవి మున్న యని తాను జంపు టుడిగి
వటముక్రింద నన్నిటి దిగవైచు వాడు
డిగ్గ నరుచెంచుతఱిఁ గని దిగ్గనంగఁ
బాఱిపోద మెవ్వారమును బట్టువడక. 18
వ. అనుటయు సంతసిల్లి మరాలంబు లన్నియుని దిలెస్సమతం బని నిశ్చయించి యమ్మతిమంతునుపదేశంబున నట్లయుం డునంత. 19

గీ. వేగుటయు వచ్చి బోయ యవ్విహాగయూథ
మున్నచందంబుఁ గనుఁగొని యుల్ల మలరఁ
గడసినవి పుల్గు లురులచే మెడలు బిగిసి
యనుచు వట మెక్కి డిగ్గైచె నంతవట్టు. 20

క. ఒకఁడొకఁడు డిగ్గవైవఁగ
సకలంబును బోవు గట్టి సంభ్రమమున ని
ల్వక చనె మతిమంతుఁ డొకఁడు
నొక కడపటిశాఖయందు నురి నురిడంగన్. 21

గీ. అతనిరాకఁ దలంపక యధికభీతిఁ
బోవుటయు జిచ్చ్వడి ముండ్వపులుఁగు లకట
మోసపుచ్చెర నన్నని డాసి బోయ
యలిగి మతిమంతుమెడ బిగ్గ నులిమి చంపె. 22

క. మతి ధృతి లేనివెడంగుల
మతి గఱపినసుమతికిం బ్రమాదము వచ్చున్
మతి గఱపిన మతిమంతుఁడు
సితచ్ఛదోత్కరముచేతఁ జెడ్డవిధమునన్. 23

క. మతిమంతుం డవ్విధమున
హతుఁ డయ్యెం దక్కఁగలుగు హంసలు దుఃఖా
యతనంబు లయ్యెఁ దముఁ గు
త్సితకాకం బొక్కరేయి సేరినకతనన్. 24

---

కివ్విధ మైనయాపదకు
నేదికతంబు విచారింపఁగా
యెవ్వాగి నెట్లు సేయుఁడు వి
హీనమతిం బ్రతికుచుఁ జైనచోక్. 3

క. అనుటయు దానికిఁ జెప్పెం
దనపొందినవేధ్లఫులి; యుదాంతోపాయం
బునఁ దీనిఁ బుత్తు నేమే
లొనరించెద నని విహంగ మొయ్యనఁ బలికెన్. 4

చ. అనవుఁడుఁ జిత్రకాయము ప్రి
యంబున నట్టిద యేని నొక్కమే
లని మితిసేయ నేమిటికి
నాప్తసఖుండుగ నిన్నుఁ జేసి య్యే
వనమున నేమిజంతువు న
శారణఁ జంపిన మాంసమున్ఁగుం
గొను మని యిత్తు నేహితముఁ
గోరినఁ జేయుము నీకు నెచ్చెలీ. 5

క. నావుఁడుఁ బెద్దయు విప్పుగ
నీవదనముఁ దెఱవు మనుచు నియమించి దురం
తావిర్భావితసాహస
మై విహగం బడఁగఁజొచ్చె నకనిపుణతతోన్. 6

సీ. దంష్ట్రికలు పాదమునఁ గొని తన్ని సంధి
నున్న యెముకను సంచున నూఁదిపట్టి
పాపి కదలిచి పెకలి యాపక్షి యధిక
వేగమునఁ బులివాఁగడ వెడలిపోయి. 7

క. ద్రుమశాఖ నెక్కి యెముకను
నుమిసినఁ బులినోరు నొవ్వియుడిగి మఱి దిన
క్రమమునఁ బుండాఁకిన నొ
క్కమహామృగముచు వధించికొని యొకనాఁటన్. 8

క. సమలంగా నచ్చోటికి
క్రమముకుక్కుటము వచ్చి కట్టెముట నిలిచి మృగో
త్తమ నాభుక్తికిఁ దగుమాం
సము వెట్టుము పలుకుచు మృదువచనములు నాలోక. 9

వ. అని పలుకుటయు. 10

క. నీ చెన్నరు మాంసం జే
లా దలచె న్నీకు నేను లంచము వెట్టక
నివ్వు పుట్టఁగ వే మృగపతి
నావచనమ్ములఁ బ్రయోజనము నీ కేలా. 11

క. అనవుఁడు నెఱుఁగవె నన్న వ
దనకుహారములోనఁ జొచ్చి దౌడలయెడ నా
టినశల్యముఁ బెఱికిన చెలిఁ
జను నే నను మఱువ నీకు శార్దూలపతీ. 12

వ. అనుపలుకువినివవ్వుచునది యాద్రుమకుట్టంబుతో నిట్లనియె.



గీ. కాయ లుడివోయినట్టి వృక్షంబు ...
యెల్లఁ గడచిన ధేనువు నేఱుఁ గ...
నతఁడుఁ గార్యమ్ము దీర్చినయతఁడు నప్పు...
కాని యాదరణీయులు గారు పిదప. 14

వ. అద్ది యెట్టిదనిన వినుము. 15

మ. విపినాంతర్బహుసత్త్వఘాతుకుఁడస్తై
విఖ్యాతకృత్యుండనై
కృప యొక్కింతయు లేని నావడనము
గ్రీష్మారతిం జొచ్చినం
గుపితత్వంబున ...
రుం గ్రమ్మఱఁ గ్ల...
యుపకారం బన నింతకంటె మఱియుం
కొండెద్ది యూహింపుమా. 16

వ. అని యిట్లావ్యాఘ్రంబు ప్రలాపింప నప్పటికిం జేయునదిలేక ద్రుమకుట్టంబు తొలఁగిపోయి యాత్మగతంబున. 17

క. ఇలపైఁ బాదాహతమై
తలపట్టెడు నెగసి ధూళి; తా నొకరుచే
నలఁపఁబడి వానిఁ దొడరం
దలఁకిన యచ్చేనటికం టెఁ దక్కువ కాఁడే. 18

మ. అని చిత్తంబునఁ దెంపుఁ జేసికొని గో
షాధిష్ఠమై పొంచి కీ
డొనరింపం దలఁచి వేచి యుండి విహగం
బొక్కింత యాలస్యమూ
నిన శార్దూలము కన్నుఁ గోఁ బొడిచి పూ
ర్ణాభ్రాంత సంతోషమై
చని భూజాగ్రముఁ బొంది యిట్లనియె హా
స్యప్రౌఢవాక్యంబులన్. 19

క. వింటే మృగమా పోయిన
కంటికి వగవకుము రెండుకన్నులు పోలియుం
గొంట యుడుగుటకు నొకక
న్నుంటకు సంతసముఁ జెందు టుచితము నీకున్. 20

క. అని పలికి యది నిజేచ్ఛాం
జనుటయు నయనంబునొవ్వి నైఁపక పులి య
వ్వన మంద్రిపన్ వాపోవుచుఁ
దనదు కృతఘ్నత్వమునను తా హతమయ్యెన్. 21

వ. కావున. 22

క. బలహీను లనుచు ధీమం
తుల కెగ్గులు సేసి పొందుదురు కీడు మహా
బలులయ్యు ప్రమాని పోటుం
బులుఁగుఁ బరిభవించి పెద్దపులి చెడ్డకైయున్. 23

## ౬. అల్పు లుపకారులనే యవమానింతురు.

క. కోసలదేశంబున ధా
రాసుతుఁ డనఁగాఁ గలండు రా జతఁడు నయ
వ్యాసంగము ధర్మంబున్
బాసి చరింపంగఁ దొడఁగెఁ బ్రజలు వలంకన్. 1

క. ఆరాజు సేయునగ్గలు
కారణముగ జనపదమునఁ గఱవగుటయు మ
న్నారాత్రింబు పసుల నా
ధారమ్ముగ నుండుకాకితండం బెల్లన్. 2

వ. ఒకయెడం గూడుకొని. 3

క. ముంగిళ్ళ నెంచువ్రులు గా
నంగఁబడవు గలుగుపట్టునం గాపుఘనం
బెంగిలి మెతుకులు చల్లుట
యుం గలుగదు మున్నవోలె నుర్విం దఱుమగన్. 4

క. కడు బలు విడవేరిచ్చటి
వెడమాయపుటాస లెల్ల వేగ విడిచి యొం
డెడ కరిగి నేరిచినక్రియఁ
గడుపులు రక్షించుకొనుట కార్యము మనకున్. 5

వ. అని కాకుల్ తమదేశముం విడిచి భు
ర్వ్యాకాంతు సందేనియుం

జనుశో చెవ్వులఁ ద్రోవ నొక్కయెడఁ గా
సారంబులోనుండి క
న్గొని మోదంబున నీరుకాకు లనుప
త్పుల్ పక్షిజాతిత్వమా
త్రనిబద్ధం బగు బాంధవంబుననచే
రంబోయి ప్రార్థించుచున్. 6

ఉ. తోఁకొనివచ్చినం దొలుతఁ
దోయజషండము దన్ను తియ్యనీ
తేఁకట వోవఁ గ్రోలి దరి
ని మ్మగుచెట్టుల నీడ నుండఁగాఁ
బ్రోఁకలు గట్టి వారిఖగ
ముల్ తమముందటఁ బెట్టు మీలఁ బే
రాఁకలి యల్లఁ దీర్చుకొని
యచ్చట నద్దినరాత్రిముండుచున్. 7

సీ. కదలి పోకువ నేఁగఁగడగుచోనప్పుడు
నీరుకాకులు వచ్చి మీర లేమి
పనికి నెచ్చోటికిఁ జనియెద రనిన మా
వసియుంచుదేశ్యమువగ్రహమున
నలఁగిన నాహారములు లేక యుండఁటుఁ
బండిన భూముల కొండుకదకు

నతిగెద మనిన వాయసములఁ గాతంప
వములట్టిదేని నేవలను నేల
గీ. యిచట నిల్వఁడింక దీకొల నెన్నఁడు
జలచరములు నిండుఁ జాలఁ గలవు
ననుభవఁ గాకు లబ్ధ వామిషంబుఁబుమాకు
మేము సేఁదు వెరవు లేమిఁ జేసి. 8
క. కావున నుదరము లిచ్చుట
నెవెరవునఁ బ్రోచికొందు మే మనుటయు మే
మీవిధ మెఱుఁగుచు నొండొక
తావునకుం బోవనిచ్చుట తగవె మాకున్. 9

వ. అని మఱియును. 10

క. కారండవమ్ము లనియెన్
మీ రూరక కొలని కఱుత నిలువుఁడు మీకా
హారంబులు గా నిచ్చలు
వారిచరోత్కరముఁ బెట్టువారము తనియన్. 11
వ. అనుటయు నగుఁగాక యని నిలిచి. 12
మ. జలపక్షుల్ వెలివైపఁ గ్రొవ్వు గలమ
త్స్యవ్రాతముల్ మ్రింగుచున్
జలజావాససమీపకుంజశిశిర
చ్ఛాయాప్రదేశంబులన్

లపిఁ గ్రీడించుచు లీలన ట్లమితకా
లం బచ్చటం బుచ్చి యు
బ్బలిపుష్టంబులు పుష్టదేహములతోఁ
బ్రహ్లాదముం జెందుచున్. 13

క. తమదేశంబున దుర్భి
క్షము వాయుట యరసి రెుజ్జఁగి చనుచుండి విచా
రము సేయఁ దొడఁగె నప్పుడు
తమలో నన్నిచఖగవితానము లెల్లన్. 14

క. కారండవములు మన కుప
కారము చేసినవి వీనిఁ గన్నుమొఱఁగి పో
నేరకయుండినఁ బ్రత్యుప
కారము సేయంగ శక్తి కలదే పిదపన్. 15

వ. అనుపలుకులు విని యందుఁ గొన్ని యిట్లనియె. 16

క. వీరికిఁ జెప్పక పోయినఁ
జోరత్వమువచ్చుఁ జెప్పి సులభప్రీతిన్
వీ తనువఁ జనినఁ బ్రత్యుప
కారం బొకయపుడు సేయఁగావలయుఁ జుమీ. 17

వ. అట్లగుటం జేసి. 18

క. వీరు మనకుఁ జేసిన యుప
కారం బప్పుడ నిజేల కైకొనిపోవన్

మీరిపుడయిన దప్పొక్కటి
యారోపింపుదముగాక యనియెల్లఁ జెపుమా. 19

క. అనవుఁడు వీరలమిాఁదను
నొనరింపఁగ దోస మొకటి గొనునతినయది క
ల్గునె యనుచు వెదకి కొఱఁతలు
గనుఁగొని యన్నియును జలభంగంబులఁ కడమ౯. 20

వ. చని వాని నుద్దేశించి. 21

క. చిరజీవము మాానామము
నరకే మా కొకటి యిష్టసంహారము మై
వరుగక మిా రిట నాఁపినఁ
బరిభవములఁ బొంద నాఁపఁబడితిమి మిాచేన్. 22

చ. నెల పదిహా్రిద్దు లే మించట
నిల్చినమాత్రిన మాకు మిాఠ లెం
గిలినతతంబు వెట్టితిరి
కిల్బిషవర్తనులార యక్కఱల్
కలుగవె యెట్టివారికి జ
గంబున నోడల బత్తు బల్లడ న్నో
డలుఁ జనుపెంచునంట యక
టా విన గే వటుఁ జేయఁ గ్యానసే. 23

వ. అనియున్నంగాక. 24

క. పుచ్ఛంబు లెత్తి మీవగు
పుచ్ఛంబులక్రిందు మాకుఁ బోరిఁ జూపుచు న
స్వచ్ఛు లయి నీటఁ గ్రుంకెద
తుచ్ఛుల మిముఁ దిట్టఁ జాలుదుమె యెట్లైనన్. 25

గీ. వ్రతులు తూలోన సగ ముండ్రు వార లిచటఁ
జేరు టాడిగ నొల్ల రాహార మెపుడు
సరసిఁ గ్రుంకుచు మీరు పుచ్ఛములక్రిందుఁ
జూపఁ జూచుచుఁ గోఁతలు చుట్టుకొనిన. 26

వ. అని పలికి 27

క. మీకో ఆగాములు సర్వము
మీ కుంకుంగాక యనుచు మింటఁ గలగోనక
గా కాః యని యఱచుచు వెసఁ
గాకులు పూర్వప్రదేశగమనముఁ జెందెన్. 28

వ. అట్లగుటం జేసి. 29

క. ఉపకార ముత్తముఁడు తన
కృపమొక్కలమున నొనర్పఁ గిల్బిషుఁ డొకప్ర
త్యుపకారము వెదకం డొక
యపకారమె రోయు నొండె నాపదఁ జేయుక్. 30

## ౭. లోభము నాశనహేతువు.

సీ. విజయపురప్రాంతవిపినాంతరమునకు
బోయ యొక్కఁడు వేటకేఁగి యచట
వనహస్తిఁ గనుఁగొని వల్మీక మెక్కి భ
ల్లమునఁ దుండము ద్రుంచి సమయఁజేసె
వానియెక్కిన పుట్టలోన వెల్వడి భుజం
గం బక్కిరాతునిఁ గఱచె నంత
వాఁడును మొలనున్న వాఁడికుఠారంబు
గొని దాని వధియించి కూలి యొఱగె
గీ. నచటి కొక్కనక్క యరుదెంచి ముదమంది
యేనుఁ గాఱునెలలు మానవుండు
సప్తవాసరములు సర్ప మేకదినంబుఁ
బోవుఁబొమ్ము తనకు భుక్తి కనుచు. ౧

క. నేఁటి కివి గంటివెట్టిఁగొ
నేఁటికి నీబోయవింట నిడ్డనరము లీ
పూఁటఁ గడపఁజాలవె యొక
నాఁటం ద్రాణంబు సను నె నవసినమాత్రిన్. ౨

క. అని తలఁచి యెక్కు పెట్టిన
ధనువుఁ గడిసి దానికొమ్ముఁ దనగొంతుంగ్రో
లున మోచియుండఁ జెలఁగుచుఁ
గొనయంబునరంబు లొయ్యఁ గొఱకఁ దొడంగెన్. ౩

గీ. ననుపు లొక్కఁడొకఁడు నానిచి కొంటకంగ
గొనయ వెల్లఁ ద్రెవ్వె కనుపుకొమ్ము
పిశసి గళమునాఁటి పెఱతల వెడలినఁ
చూసికొనుచు నక్క కూలి కెడసె. 4

వ. అట్లగుటం జేసి లోభం జొప్పదు. 5

---

## ౮. అతివ్యయ మాపదకు మూలము.

గీ. పెక్కునీళులు లేనట్టి యొక్కమడుఁగు
కేవ్రిక మన్నత మఘనారికేళ మొకటి
చేరుకొక్కెర యొకటి వసించు నచట
వారిజాంతరజలచరాహార మగుచు. 1

క. అది యొకనాఁ డంబరమునఁ
బదివేలు బకాదివారిపక్షులు సనఁగా
నదె నాకొలఁకులు వో
యెద రని యడ్డముగఁ బోతి యెక్కుడుప్రియముల్. 2

క. కావించి మీర లూరక
పోవుట దగ దల్లభూజమున నిలుతు మదీ
యావాసం బది యచటికి
రావలయును బాంధవాభిరంజన మొసఁగన్. 3

వ. అని తనవసియించు నారికేళంబును జూపి ప్రార్థించి మఱి యును. 4

క. కొల నొక్కటి కల దచ్చట
జలములు నాహారములు ప్రశస్తరుమలతోఁ
గలిగెడి నేఁటికి మాటలు
కొల మెల్లను బాగడ వింధు గోరి యొనర్తుర్. 5

వ. అను పలుకులు విని బుద్ధిమంతంబు అగు విహంగములు కొన్ని.

చ. వలవదు మమ్ముఁ నాఁగ గుణ
వంతుఁడ వీవు కొలంబువారిపైఁ
గలిగిన భక్తియుం బ్రియముఁ
గన్గొన సంతసమయ్యె నిచ్చలున్
నిలిచినఁగాని కాచె గమ
నింపఁగనిమ్మని పెక్కుభంగులన్
బలికినఁ బోవకున్నఁ గని
పక్షులలోపలఁ గొన్ని జావితోన్. 7

క. ఈయూథ మిది యనంతము
నీయిర వెడలేదు నిలువ నీచెప్పినయా
తోయంబుల నాహారము
మాతొలుఁగనియవియె యల్పమాత్రము అవియున్. 8

వ. అన్నంగాక. 9

క. కనుఁగొఱకు వంద లిపి మఱి
చను నెండొక దెసకు నీవు చాలవు నీకో
క్కని కైనను జలభాగము
మునయంతను నోర్చు మడుఁగు పోనిమ్ము మముల్. 10

చ. అనుటయుఁ బొత్తువారికృప
నన్నియుఁ గల్గెడు నన్నుఁ ద్రోచిపో
యినఁ గులమెల్లఁ గన్గొనఁగ
నిప్పుడ మేను దొఱంగువాఁడఁజుఁ
డనుచుఁ బతత్రికోటి మన
కారడిఁ బాపముఁ బొందనేఁటి కి
ట్లని యితఁ డాడ నంచుఁ జని
తండముఁ గొక్కెరయింటివిందులై. 11

వ. అట్లు పోయి. 12

మ. మడు వెల్ల న్వెదఁజూడి మందుకయినన్
మత్స్యంబు లేకుండ న
ప్పుడ యొండొంటికి మున్న మ్రింగి విహగం
బుల్ మూపు నిల్వంగ ని
క్కడ నిమ్మెయిఁ జాల దంచుఁ జనినం
గారించు పేరాఁకటన్
మడిసెన్ గొక్కెర కొన్నిప్రొద్దులకు హీ
నంబైనదేహంబుతోన్. 13

వ. అట్లగుటం జేసి. 14

క. వ్యవసాయము గొలఁదియు దే
శవిధముఁ గాలంబుఁ బూర్వసంచిత మగుసొ
మ్ము విచారింపక యుబ్బునఁ
దివిరి వ్యయము సేయునతఁడు దీనతఁ జెందున్. 15

---

౯. అవివేకులకు హితము దెలుపుటగూడ హానియే.

---

క. కానన మొక్కటబహుఫల
సూనక మొకప్రాంత నొక్క సూచీముఖము
న్వానరమును దమలోపల
నూనిన నెయ్యమున నుండ నొకనాఁటి నిశిన్. 1

క. మిన్నెల్ల నీలమేఘ
చ్ఛన్నంబై యొక్కవాన సాంద్రజలంబై
మున్నుగురిసి తుది నీడయు
సన్నపుఁ జినుకులును విపినచరబాధలుగాన్. 2

వ. ఎడతెగక యున్న సమయంబున వానరంబు చలివడఁకు
నగ్గిజగాఁ డొకనాఁడు. 3

చ. మిడుఁగుఱుఁబుర్వు వెచ్చ తగు
వృత్తికపాదున నంటఁజేసి రొం

కేడనఱిలోన నిడ్డ నది
యిమ్ములఁ గ్రాలెను మాపరేఖగాఁ,
దడియని కోటిలోనఁ బ్రియ
దారయుఁ దానును నుండి సీతునం
గొడుఁగుర వోయియున్న సఖుఁ
గ్రోఁతిఁ గనుంగొని చాలఁ గుందుచున్. 4

వ. సీతద్వారంబునకుం జనుదెంచి యతనితోడ. 5

క. వడఁకెను గదయ్యా వానకు
నుడుకువ లేదయ్యొ రాత్రి యుగమునుగాఁ కె
న్నఁడు వేగున్, యెవ్విధమున
నుడుగు న్నిబాధ యొట్టు లూరక నిలుతున్. 6

క. ఎడలేదు నిన్ను రమ్మనఁ
గడుసన్నము నాగృహంబు కపివర పెక్కా
డెడిదేమి యిట్టిప్పుట్టుగు
వడసినపుడకాదె నాదుపౌరుష మడఁగెన్. 7

ఉ. మచ్చిక రెట్టిగాఁగఁ దన
మందిర మొంది యభీష్టవస్తువుల్
నెచ్చెలు లెల్లఁ బొంది సుఖ
లీలఁ జరింపఁగఁ జేయలేమికిన్
వెచ్చఁగియూహ్ప నించికొని
విన్నఁదనంబును బొంది నెవ్వగ

న్వెచ్చినయట్లు సజ్జనుఁడు
వేశోకదుర్దశచేత నొవ్వనే. 8

క. ఓర్వం దెలియఁగక యుండఁగ
నోర్వం దెలియఁగంగఁ జూడకుండఁగ నోర్వం
డోర్వఁడు సూడఁగ సుజనుం
డుర్విం దనవారికైన యొప్పము లెందున్. 9

వ. అని తగుమాటలాడి పెద్దయు వగచి మఱియు నప్పక్షి
యిట్లనియె. 10

గీ. కాలఁజేతఁ బేదగావు నీయట్టివాఁ
డకట యుండఁదగిన యాలయంబు
మున్ను చేసికొనని మోసాన నీపాట్లు
పడఁగవలసె నిపుడు నడికిరేయి. 11

క. అని పక్షి హితము చెప్పిన
విని వెంగలి మైనకోఁతి వీఁడిరవున నా
లును దాను నుండి నన్నొక
పిరుఁగుం గాఁ దలఁచికాదె ప్రేలఁ దొడంగెన్. 12

క. తనయింట దివియ యుండఁగ
నను గాయు మనందు నెగడి నాకోఁ గొఱమా
లినమాటల నీసుమంతయుఁ
గొనకుండఁగ నాడె నిట్టికుటిలుఁడు గలఁడే. 13

చ. తనకంటె యిల్లు గల్గె నంటె
తా దొర నాకంటె యిల్లు లేదు! న
న్ననఁ గడుఁ గ్రొవ్వె పిపులుఁగు
పుచ్చెత దీనిమదం బటంచుఁ బె
ల్లనఁ దరుశాఖ విర్చి కపి
యచ్చటి చేరువఁ బల్వలోదకం
బునఁ బడవైచె నంత వెత
పుట్టె ఖగాంగన కూయుచూడఁగన్. 14

వ. అప్పుడు. 15

క. తడిసినయొటికలఁ నీళ్లం
బడి బెగడిన మనసు గలుగు పాణేశ్వరి న
వ్యోడ నుడిపి తెచ్చి యొండొక
యెడకుం గొని యేఁగి పక్షి యిమ్ములఁ నుండెన్. 16

క. కావున వివేకహీనుల
త్రోవం బోవలదు వారితోడి చెలిమి దా
నేవెంటనైన నాపద
గావింపక పోదు సుమతికలితుల కైనన్. 17

## ౧౦. సుమతిపగ మేలు విమతి నెయ్యమునకంటె.



క. మందరపురిఁ గాంతాజన
కందర్పుఁడు గలఁడు రాజు ఖగవృత్తిప్రఖ్యా
ఖ్యం దనరి బుద్ధిమంతులఁ
జెందఁడు సాక్షరుఁడు గాఁడు శిశుకాలమునన్. 1

క. గర్వోద్ధతచాపలమున
దుర్వర్తనుఁ డైన నృపసుతునిచే విడువన్
సర్వము గని తన్మంత్రులు
దుర్వారాసహ్యబహుల దుఃఖాన్వితులై. 2

వ. ఆత్మగతంబున. 3

సీ. అక్షరజ్ఞుఁడు గాని యతనికి శాస్త్రపు
రాణాగమాదులు రావు సారఁగ
గ్రంథాధిగమశక్తి గలుగక శుద్ధవి
వేకంబు లేదు వివేకశుద్ధి
కలుగక కర్తవ్యకర్మ మెఱుంగఁడు
కర్తవ్య మెఱుఁగక కడఁగి చేయు
క్రియల నీఁగఁగరాని కిల్బిషంబులఁ బొందుఁ
బాపుండు నరకకూపమునఁ ద్రెళ్లు

గీ. నరకవాసి వేదనఁ దగుఁ బేదయై
కడుపుకొఱకుఁ బాతకములు చేసి

రౌరవమునఁ గూలు గ్రిమ్మటి నట్ల యూర
వదలకెల్లఁ గుక్కురు చదువు లేమి. 4

వ. అని చింతించుచుండ నక్కాలంబున. 5

సీ. ఎలుకవేఁటలవెంట నేఁగి పట్టణములోఁ
బ్రజలయిండులు కూలఁద్రవ్వఁబాపుఁ
జెలఁగి జేగలకుఁ దొండలనేయఁబోయి దా
ఠామంటపంబులు గాసిసేయుఁ
గోడిపోయలవెంట వాడలఁ దిరుగుచుఁ
బూడఁగన్న కడవలఁ బొలియవైచు
వేటకుక్కలఁ దెచ్చి విడిచి మందలలోని
మేఁకల కుసికొల్పి మెచ్చియార్చుఁ

గీ. గాలికింకరులట్టి కింకరులతోడఁ
గూసి రాఁగూంటి ప్రొద్దునఁ గడుపుదొరఁగి
వెసఁగుఁదనముఁ బిల్లదనము వేనవేలు
మదముతోఁ జేయుచును రాకుమారుఁ డిట్లు. 6

క. ఉరులును బోనులు గూళ్ళును
బరుసని చెయ్యములు గాలిపడగలు బొరిఁ గిం
కరులం బొడిపించెడి యా
సరభసములు దక్క నొండు సైఁప వలెనికిఁ. 7

క. ఆనరపతి యనుపఁగ నొక
వానరపోతంబుఁ దెచ్చి వాత్సల్యముతో

దానిఁ బెనిచి యాయుధవి
ద్యానిపుణతఁ బొందఁజేసె యవిషద్ధిలుమున్. 8

క. కంచుకము దొడిగి కుండల
చంచత్కటకాతివేషచయమిడి శితఖ
డ్గాంచితరూపముతోఁ దన
కంచుకియై యుండఁబనిచెఁ గదలక యెప్డున్. 9

సీ. ఆరాజు మందిరో ద్యానంబునకు నేఁగి
యొకనాఁడు తాను బయోజముఖులు
దడవుగాఁ గ్రీడించి యొడలు నిద్రాలసం
బగుటయునందఱు నచట నచట
వసియింపుఁ డనిపంచి వనచర మొక్కఁడు
తోడరా దట్టంపుపొద నిలిచి
పరిమళమ్మృదుసిత పవనంబు నెలవైన
గురివెందపందిరి గుజ్జుసెజ్జ

గీ. సుప్తుఁ డగుచుండి వానరుఁ జూచి నన్ను
డాయవచ్చిన జీవుల వేయు ఖడ్గ
ధారఁ దునియంగ ననిచెప్పి కూరె నిద్రఁ
గపియుఁ బనిపూని భూపతిఁ గాచియుండె. 10

వ. ఆసమయంబున. 11

మ. సుమనోవాసము రాజుకంధరమునకా
శోభిల్లి నత్తావికై

భ్రమరం బొక్కటి మూఁగ దానిఁగని కో
పవ్యగ్రమై క్రోఁతి ఖ
డ్గమున న్వ్రేసినఁ దేఁటితోఁ బ ధరణీ
కాంతావతంసంబు కం
ఠము రెండయ్యె వినీతుఁడైన పతిచే
ష్టల్ చేటు దెచ్చుందునే. 12

---

## ౧౩. చెఱుపఁదలఁచువాఁడే చెడిపోవును.

సీ. శంఖిసీమానగరంబునందు గలఁడు
బంధుకులం డనియెడు నొక బ్రాహ్మణుండు
ధనికుఁ డఁట తొల్లి యవిలంఘ్యదైవఘటనఁ
బిడ్డలై పుత్రు లుండంగఁ బేదపడియె. 1
వ. అప్పు డతం డాత్మగతంబున. 2
మ. ఖలవద్దైన్యము వక్త్రగహ్వరముగాఁ
బల్చెట్లఁ గొన్నట్టియ
ప్పులు మైచాఱలుగాఁగ బొలమడితం
బు ల్బ్రోగుట ల్గాఁగ దు
ష్కిలయారణ్యములో భయప్రకరమా
త్రి కూరమై యుండఁగాఁ

దళమే వెల్వడఁ జేయ లావుకలిమిన్
దారిద్ర్యశార్దూలముల్. ౩

ఉ. ఐనను దీనిఁ బాపఁదగు
యత్నము చేసెదఁగాక చిత్రవ
ర్ణనగరంబులో గుణాగ
రిష్ఠుఁడుఁ బూర్ణధనుండునై మదీ
యానుజుఁ డున్నవాఁడు విపు
లాఖ్యుఁడు వానికి సొమ్ముగల్గఁగా
నే నిటు బీదనైనవిధ
మిచ్చ నెఱింగిన వాఁడు కుండఁడే. 4

వ. అతం డాసంగు కనకము గొనివచ్చి యిచటం గర్షకుండ
నయ్యెద. 5

సీ. ఈలోక మింతయు నాలుగుపాళ్లు లిం
దొకట భిక్షుకులు సోమరులు నొక్క
పాలు సేవావృత్తి బ్రదికెడువారు వి
ద్యోపజీవికులును నొక్కపాలు
వ్యవహార మాడెడువారుఁ దస్కరులును
నొకపాలు కర్షకు లొక్కపాలు
మొదలిపాళ్లులు మూఁడుఁ బిదపటిపాలిన
యనవరతంబును నపహరించు

గీ. నపహరించియు నంతంత కవి నశించు
నపహృతం బయ్యు నది వృద్ధినందుచుండుఁ
గానఁ దగురాజు గలిగినఁ గరిసనంపు
జీవనముఁ బోల వొండొక జీవనంబు. 6

క. అని తలఁచి కదలి కతిపయ
దినముల ననుజపురి చేరి తెరువున డస్సెన్
దనువు మును బేదయై నలిఁ
గినవూనముకంటె మిగులఁ గృశమై యుండెన్. 7

మ. అనుజాగారముఁ జేరవచ్చిన నతం
డల్లంతఁ దా నగ్రజుం
గని సందేహము నొందియుఁ గమనరే
ఖామాత్రి శోధించి క
న్గొని కన్నీరునఁ బాదము ల్గడిగి స
న్మోదమ్ముతో నెత్తి దీ
వన డగ్గుత్తిక డింద నాతఁ డశిమె
న్వాత్సంబుతోఁ దమ్ముఁడిన్. 8

వ. తదనంతరంబున. 9

క. విప్రుఁడు నగ్రజునకుఁ దగు
నుపచారంబులు ప్రమోద ముత్కటముగ ని
ష్కపుభక్తిఁ జలిపి యాతఁడు
విపన్నుఁ డగు టతనిచే విని దుఃఖితుఁడై. 10

వ. నిజపుత్రకళత్రసహితంబుగా నాతని నిష్టదేవతావిశేషం
బున నారాధించుచుండ నొక్కమాసంబు చన బంధుకుం
డు తమ్మునితో నొకనాఁటిరాత్రి యెల్లి యవశ్యంబునుం
దనకుఁ బయనంబు సేయవలయు నని నిర్బంధించి పలికిన
నర్ధరాత్రసమయంబున నవ్విపులుండు దనయంగణంబున
గతపరిసాంద్రమాధవీలతాచ్ఛన్నం బగు చూతకుంజంబు
క్రిందికిం బూర్వజుం దోడ్కొని యేఁగి వేకువన యతనిప
యనం బగుటఁ దన్నిమిత్తంబు లగు మాటలాడె. 11

క. కానిపోవరాదు తెరువునఁ
గనకము తెక్కలి ఘనంబు కాకున్నను మో
వనురాదు పెద్దహేమం
బని యన్నకుఁ జెలియఁజెప్పి యకుటిలమతియై. 12

వ. అనేకనిష్కసహస్రమూల్యం బగు నొక్కమాణిక్యం బత
నికి మ్రింగ నిచ్చి మీరు ప్రభాతంబున జీర్ణమలినాంబరం
బులు ధరియించి యరుగునది యనిచెప్పి యిరువురు శయ
నస్థానంబుల కరుగుటయు. 13

క. వారలపలుకులుఁ దద్భావ
పారంబులుఁ దెలియనెఱిఁగి ప్రమదహృదయుఁడై
చోరుం డొకరుం డచ్చోటి
భూరుహమున నుండి వారు పోయినవెనుకన్. 14

ఉ. కన్నము వెట్టఁ జన్న నొక
కంచముఁ జీరయుఁ గాక యబ్బ దా
స న్నిలువం బ్రమాద మది
చాలఁగ లాభము చేరె నాకు నే
నిన్నిశి వచ్చి వేగుతటి
నిప్పటివిప్రుని గూడి పోవుచుం
గన్నపువేఁట మాని మణిఁ
గైకొని ధన్యుఁడ నై చరించెదన్. 15

వ. అని నిశ్చయించి యచ్చటు వాసి పోయి ప్రభాతం బగు
టయు. 16

గీ. పయనమై పోవు బ్రాహ్మణుపజ్జఁ దగిలి
సాధువోలె నాతనితోడ సముచితంపు
భాషలాడుచుఁ దనచేయుపనికి సనువు
తలఁచికొనుచు జోరకుండును దవమునను. 17

క. నడుమ నలవడడు ముందటి
యడవిం దెగఁజూతు విప్రు నని తలఁచుచు న
య్యడవిఁ దరిసి యరుగఁగ న
క్కడఁ దెక్కలికాఁడు వచ్చి కడురౌద్రమునన్. 18

క. ఇరువురఁ గట్టియుఁ గొట్టియుఁ
బరిభవములు వెట్టఁ బేదపన్నల మనుచున్

గరుణముగఁ బలుకఁగాఁ గృప
యొలగినచిత్తముల వార లొండొరుతోడన్. 19

క. ఈయొడళుల కీకోకలు
వేయైనను దగవు కపటవేషము లివి యీ
మాయలకు మనకు లేదె యు
పాయము చీఱుదము వీరిఁబట్టి యుదరముల్. 20

వ. అనుచుండ నందులో ముఖ్యులగువారు. 21

గీ. వ్రిత్త మొకనికడపు వ్రియ్యంగ నందులోఁ
బసిఁడి లేక యున్నఁ బరుని బ్రదికి
యరుగనిత్తముండినట్లైన నితరుని
వ్రిత్త మిదియె కార్యవృత్త మనుచు. 22

వ. నిశ్చయించి తమ యిరువురిలోపల నొకని వధియింప ను
ద్యుక్తు లగుసమయంబునం జోరుం డాత్మగతంబున. 23

క. ఏనేమి తలఁచి వచ్చినఁ
దానేమి తలంచె నిచట దైవం బవురా
తా నొక్కటి తలఁపఁగ విధి
తా నొక్కటి తలఁచు ననుట తథ్యం బయ్యెన్. 24

క. పావనుఁడు బ్రాహ్మణుం డని
భావింప కకారణముగఁ బాపాత్ముఁడ నై
యీవిప్రుఁ జంపఁదలఁచితి
నావిధి యుట్లుండ నట్లు నా కేలబ్బున్. 25

ఉ. ఒప్పమి సేయఁడేనిఁ దగు
నుత్తమవంశజుఁ డేని నేరికిం
దప్పొనరింపఁ డేని సతి
ధార్మికుఁ డేని దురాత్ములైనవా
రప్పురుషావతంసమున
కాఁడిడి యొగ్గొనరింపఁ జూచినం
దప్పునె చేటు వారలకు
దైవముకన్నులు పుట్టఁజేకుతే. 26

గీ. ఇతనికడుపు వ్రచ్చి యుం డిప్డు రత్నంబుఁ
గాంచి రేనిఁ జనదుకడుపు వ్రత్తు
రూరక చంపిపోదు రూరక విడువరు
కడుపు వ్రచ్చు టెట్లు గట్టి తనకు. 27

వ. అయినను. 28

క. తనకడుపు మున్న వ్రచ్చినఁ
గనకము లేకున్న నతనిఁ గాచెద రెట్లుం
దను విడువ రింక బహుళచిం
తనములఁ బని యేల కాచెదంగా కితనిన్. 29

వ. అట్లుంగాక. 30

క. క్షీణాకరుణచే బ్రాహ్మణు
ప్రాణముఁ గొనఁదలఁచినట్టిపాపము మగుడం

ప్రాణంబుఁ గాచి యతనికిఁ
ప్రాణం బిచ్చుచున్న వాని బాయఁగ నేర్చున్. 31
32 వ. అని కృతనిశ్చయుండై.
క. తనకడుపు మున్ను ప్రచ్ఛా
డనుటయు నటుఁ జేసి వారలం దేమియుఁ గా
ననివాఁ డై యాతని ప్ర
చ్ఛిన యట్టుల కాదె యేల చెనఁటిగఁ జంపన్. 33
వ. అనుచు నవ్విప్రుబంధముక్తునిం జేసి నిజేచ్ఛం జనుచుం
టయు. 34
క. క్రూరులచే విడివడి సుత
దారాములఁ గలసి యతఁడు ధన్యుం డయ్యెం
జోరుఁడు వివేకమానస
చోరుఁడు నాకమున కరిగి సుఖియై యుండెన్. 35
క. అవివేకచరిత మ్మిట్టిది
సవివేకచరిత్ర మిట్టిచందం బగుటన్
సవివేక హీను సంగతిఁ
దవులఁగ వల దాపదలకుఁ దప్పఁ దలఁచినన్. 36

## ౧౨. మతిమంతు లుపాయముచే శత్రుల జయింతురు.



చ. ఒకపెనుగానలో నొక మ
హోన్నతభూజమునందు బాలశా
బకములఁ బ్రస్ఫుటప్రబల
పక్షములం గలవానిఁ బ్రోచి కొం
చొకశుకి యుండు నత్తరువు
నొద్దన చిక్కని వెల్గమానియం
దొకఫణినాయకుండు గర
ళోల్బణుఁడుం డొకకోటరంబునన్. 1

వ. అట్లారెండును నుండ నంత నొక్కనాఁడు. 2

క. తొల్లియు నచ్చోటన తన
పిల్లలఁగాని చన్నబోయ పెద్దయుఁ గ్రూరుం
డుల్లమలర నబ్భూరుహ
మల్లన నెక్కె తనకూర్చునాత్మజయుగమున్. 3

క. చంచులు దెఱచుచు నఱవఁగ
నించుక కృపలేక పట్టు టేర్పడఁ గని శో
కించుచు రోధించుచుఁ బల
వించుచు నాతనికిఁ జిలుకవెలఁది యిటు లనెన్. 4

క. అన్నన్న లేవె పక్షులు
కన్నులు తెఱవనివి తిన్నఁ గలదే చవి నా

మన్నిఁ గొననేల విడువఁ గ
దన్న యకట చంపఁగూడ దయ్యా శిశువులన్. 5

చ. అనవుడు బోయ యిట్లను శు
కాంగనతోఁ నడలంగ నేల నీ
తనయులఁ జంప నేను బిసి
తంబులు బ్రాఁతియె నాకు వీనిఁ గై
కొని వెలవెట్టు వారికడ
కుం జని యమ్మకు విల్చి పొందుదున్
బెరుకుదు గాని వీని కొక
పీడ యొనర్పదు నమ్ము నెమ్మదిన్. 6

క. అనవుడు దానికిఁ గీరాం
గన సంపఁగ నొల్ల వేనిఁ గనకము పైఁ గాం
క్షన పట్టితేని విడు నా
తనయుల నీ కేను జూపెదను హేమంబున్. 7

మ. ప్రకటశ్రీయుతుఁ డొక్కఁ డీయడవిలోఁ
బాటచ్చరశ్రేణి బా
ధకు నుల్లంబున నోడి యున్న తనయు
ర్థంబొక్కచోఁ డాఁచెఁ ద
త్ప్రకరం బేఁ జూచితి నున్న దావసించిఁ జూ
పంజాలుదు న్నన్నుఁ బు

త్రకులం గాచెద నెల్లనాఁడు నని పం
తం బాడి రక్షింపుమా.

మ. అనినం బెన్నిధి యప్పుడే కనిన య
ట్లానందముం బొంది యే
నిను నమ్మింపుదు నంచు శాబకముల
న్నీడంబులోఁ బెట్టి చ
య్యన భూమీజము డిగ్గి బోయ నియతుం
డై యొక్కచో నిల్చియు
ల్లను బోనున్ వెసముట్టి నమ్మఁదగుప
ల్కుల్ పల్కె నిర్వంచనన్.

వ. అప్పుడు కీరవనిత వానితో నిట్లనియె.

క. నమ్మిక లవియేమిటికిం
గ్రమ్మఱ వచ్చెదవె నీవు ఖగమృగబహుదుః
ఖమ్ములకును నాచూపెదు
సొమ్ములపైఁ జేయి వెట్టి సుఖివైనతుదిన్.

వ. అనిపలికి యిదె రమ్మని తోడ్కొని చని.

గీ. పూనుఁగాడియంత భుజగంబు లోనున్న
వెఱఁగ్రమాని వెడఁదతొఱట సూపి
దీనఁ జేయివెట్టి లోన నున్నది సవి
శేష హేమ మనుచుఁ జిలుక చెప్పె.

ఉ. చెప్పిన వెఱ్ఱిబోయ వల
చే యటు సొన్పుచు నందు గన్నులన్
నిప్పులు రాలుచున్న మహా
నీయగరోజ్జ్వలభీషణోరగం
బుప్పలవాయిఁదిన్న విష
ముగ్రత నెక్కుడు దృష్టి చీఁకటుల్
గప్పఁగ నోరఁ బెన్నురువు
గ్రమ్మ మృతుండయి కూలె మేదినిన్. 14

గీ. ఆస పాపజాతి యఖిలంబుపైఁ బాఱుఁ
బసిఁడిమీఁద నేలపాఱకుండు
పసిఁడిమీఁద నాసపాఱినమనుజుండు
తనకు వచ్చుకీడు తలఁపఁగలఁడె. 15

క. తనచే నసాధ్యుఁ డగు శ
త్రుని నన్యునిచేతనైనఁ దుంగునటులుగా
నొనరింపవలయుఁ దా నెఱుఁ
గనివాఁడునుబోలె నీతికౌశల మెసఁగన్. 16

## ౧౩. మొగమోటము ముప్పు తెచ్చును.

క. యక్షపురంబునఁ గలఁ డొక
యక్షుఁడు ప్రియభాషణుఁ డన నతనివనిత ప
ద్మాక్షి నిపుణిక యనంగల
దక్షుదరిస్నేహముఁ దాతఁ డయ్యాతివయెడన్. 1
క. ఆరమణి గర్భభరశ్రాం
గారంబున నొప్పెఁ బౌరగణ మట్టియెడన్
క్షీరాబ్ధినాథునుత్సవ
మారూఢం బగుటఁ జూడ నని యేఁగుటయున్. 2
వ. ప్రియభాషణుండు నిపుణికతోడ. 3
ఉ. కొండికదాన వెన్నఁడును
గ్రొత్తవినోదముఁ జూడ వింటఁ గా
పుండెద నేను నీవు నను
ముత్సవ మిమ్ములఁ జూడ నన్న నీ
వుండఁగ నొంటి నేఁ జనుట
యుక్తమె కాదని పల్కితేని నీ
నిండిన చూలు మోచుకొని
నేర్తునె యచ్చటి కేను బోవఁగన్. 4
క. అనుటయు నీవటఁ జను మిటఁ
జనుదెంచినయంతదాఁకఁ జూమా నీతా

ల్చినగర్భముఁ దాల్చెద నని
తనకుక్షిం జూలు మోఁచి తరుణిం బంచెన్. 5

చ. పనిచినఁ బోయి చూడ్కులకుఁ
బండువ నందగు నుత్సవంబు నిం
పెనయఁగఁ జూచి వారుఁ దమ
యిక్కలకుం జనఁగా రసాంతరం
బున మునమూఁది యింటిదెస
పోవుట మాని విభుండు మున్ను సే
సిన యుపకారముల్ మఱచి
చేడియ చింతయొనర్చె నాత్మలోన్. 6

ఉ. ఇంటికి నేను బోఁ దడవె
యెప్పటిగర్భము నిచ్చువాఁడు నా
కంటికి నిద్ర లేక యది
గైకొని మోవఁగ నేల వానిచేఁ
గొంటినొ తింటినో యతని
కుత్సితబీజము వానిమీఁద నే
తుంటితి నింక నాకొరుల
దూఱు బాగస్త్రయుఁ జూడ నేఁటికిన్. 7

క. చూలు వహించి వెక్కుచును
స్రుక్కుచు నుండి ప్రసూతివేదనం

జాలఁ గలంగి యాపదను
జడ్డపడంగను నాకు నేల నా
పాలిటిదయ్య మద్దొసఁగు
వాపినఁ గ్రిమ్మఱి నేల పోదునం
చాలలితాంగి వేఱ యొక
యక్షునిఁగూడి నిజేచ్ఛ నేఁగినన్. 8

వ. అంతట. 9

క. కడు పధికముగాఁ బెరిఁగిన
వెఱమాయం బేని నూర్పు వెడలక కడుల్లోఁ
బడి మూతికి విలపించుచు
వెఱఁగగుయక్షుండు ప్రాణవిరహితుఁ డయ్యెన్. 10

క. తగ దొరుల నమ్మ నెప్పుడుఁ
దగువారల నమ్మరేనిఁ దగుఁగాక మహిం
బగవారల నమ్మఁదగదు
పగవారలకంటె వలదు భామల నమ్మన్. 11

క. బలుపున మెలపునఁ గేళిక
కులభామిని వెఱచుఁ గూర్చుఁ గుమతిత్వమునన్
దల నెక్కించుకొనం బతి
కులమును బ్రాణంబు సొమ్ము గోమలి చెఱచున్. 12

## ౧౮. దుష్టుల నమ్మియు నమ్మకుండవలెను.



క. క్రూరోరగగ్రహణవిష
హారియనంబరఁగునొక్కఁ డతిశయవిషదు
ర్వారము నొక సర్పంబు న
భీరుండై పట్టి వెదురుఁబెట్టియఁ బెట్టెన్. 1

క. పట్టి దానికి నెరగాఁగఁ బట్టి యొక్క
మూషకము వైచిపెట్టియమున్న వోలెఁ
గట్టి డించిన నురగంబు గఱవ రాఁగ
నెలుక బెదరక దానితో నిట్టు లనియె. 2

క. నీ కుపకారము సేసెద
నా కభయం బిచ్చి కావు నా కార్యంబుల్
నీ కార్యంబులు మేలై
చేకుఱు నాతోడఁ జెలిమి చేసితి వేనిన్. 3

గీ. వాఁడు పట్టినపుడ వానిచే నైనను
జావవలయుఁ దనకుఁ జావు నిజము
చచ్చియున్న నన్నుఁ జంపి చావని నీకుఁ
జెఱనయుండఁ దలఁచు టెఱుక యగునె. 4

క. ఏ నధిక బలుఁడ నాచేఁ
గానిది యీ యెలుకచేతఁ గానోపెడు నే

ఆ సా చెలి యేవిధమున
పోనుకు నిడి కల్లయనుచు మదిఁ దలఁపకుమీ.

క. వినుమెవ్వాఁ డేకార్యం
బున నిపుణుఁడు దానియందుఁ బూజ్యుఁడు వాఁడుం
డనవలదు సూడినయ్యెడు
పని చిక్కనికలుతచేత బాగైయున్నె.

ఉ. చాలనభీష్టముల్ తనవ
శంబుగఁ జేయు నయోగ్యుఁడైన న
ష్మోలుఁ దలంచి వానియెడ
మిక్కిలి వేడుకసేఁత నేర్పగుం
గాలపుపేఁటకాఁడు ఝష
కాంక్షను తా నుదకంబులోఁ బటుల్
తేలెడు దృష్టిపై నిలుపు
దృష్టియుఁ జిత్తము నాదరంబునన్.

క. తనకార్యముకొఱకై హీ
నుని పెద్దనైనఁ బోఁజను మహింబండా
లునియింటి కుపశ్రుతికై
చనునన్గా స్వార్థముఁ జెడి సద్విజుఁడైనన్.

క. నా చెప్పినట్లు చేసిన
నీ చెలువిడు నట్లుఁగాక నిలుపోవక నీ

వే చంపి నన్ను నోరను
వైచికొనిన మానునే భవత్సుతులెల్లన్. 8

మ. చెఱ యేఁ బాపిన నిష్ఠమైన వలనం
జెన్నొందఁ గ్రిడించుచున్
జిఱుఁగప్పల్చవిమీలు బల్లు లెలుకల్
చిట్టెల్క లాహారముల్
వఱలన్ గుత్తుకబాటి తెమ్మెరలఁ గ్రో
లం బెట్టపెంబాముతో
నెఱియున్ భోగముసుట్టునుంగలుగు నీ
వీక్షింపుమా నెమ్మదిన్. 9

క. అనవుడు నురగము సంతస
మున నాఖువుతోడ స్వప్నమునన్నైనను గీ
డొనరింప నీవు నాచెలి
వనుమానముఁ దక్కనమ్ము మానందముతోన్. 10

వ. ఇక్కరండనిగ్రహ మెట్లుడిపెద వ్రుసుపుమనుటయు. 11

క. ఏ నొక మంత్రమునీతల
పైనుండి జపించి జపము వాకొంచి తగం
గా నినుఁ బిలిచెద కదలక
నీ నయనయుగంబు మూసి నిలు మందాఁకన్. 12

చ. అని నియమించి దాని శిర
మంజకమెక్కి కరండనిగ్రహం

అనువుఁగఁ జేసి యాఖువక
మప్పుడ పోయె ననంతరంబు లో
చనములు విచ్చిచూచి మది
సంతసమున్ వగపుందలిర్పగా
కనుమన తాను నేఁగి భుజ
గం బొకబొక్కవసించి యాత్మలోన్. 13

క. ఎలుక కపటమున నాక
న్నలు ద్రావమెను మ్రింగతేద నో రెరియఁ గటా
తొలఁగెద నిఁకేఁటిబ్రతు కని
తలఁచె దురాత్మకుల కెందుఁ దగవులు గలవే. 14

క. కెలనికి మేలుగఁ దనకుం
గలిగెడు నిందత్రిత్వమైనఁ గాదనుఁ దుదిఁ దాఁ
బొలిసిన మేలని తలఁచును
ఖలుఁ డొకనికిఁ గీడుసేయఁ గలిగినఁ జాలున్. 15

వ. ఇట్లుండి దాని బిలద్వారం బెఱింగి యయ్యాశీవిషం బమ్మూ
షకంబునకు దోషం బాపాదించు నభిలాషంబున. 16

గీ. దానిబొక్కకడకుఁ దా నేఁగి నాప్రాణ
సఖుఁడ యేఁగుదెమ్ము సత్వరముగ
నొక్కచోటనుండి యుచితసల్లాపముల్
సేయవలె నటంచుఁ బిలుచుటయును. 17

. లాఁగలు పెక్కులు లోపల
బాఁగై తమ ముట్టినపుడ పట్టువడక లో
డాఁగి చని వెలికి వెలువడి
పోఁగనుమంటి గలుగునట్టి బొక్కయొరిక్కిన్. 18

వ. వచ్చి మృద్బద్ధంబైన బిలద్వారంబున నిల్చి యాద్విజి
హ్వాంబుతో నిట్లనియె. 19

క. నన్ను మును నీవు గాచితి
నిన్నుం జెఱ నేను వాపి నిలిపితి నాకై
మున్ను గల కరుణ మఱవక
మన్నింపుము నాకు నంత వశానము చాలున్. 20

గీ. పియ్యముండఁ బోక కయ్య మొనర్చుట
చెలిమి సేఁత తమకుఁ దలము గాని
వారితోడఁ దగదు వలదు నీ చెలిమికి
నేను హీనబలుఁడ నెంతవాఁడ. 21

క. మున్నీవు నాకు వైరివి
మిన్నక కార్యార్థమాత్రి మిత్రత్వమున
న్నన్ను సహింపుదువే చను
మిన్నిపలుకు లేల వెఱతు నే నిముఁ గరన్. 23

వ. అనుటయు నయ్యహి సిగ్గువడి పోయె నమ్మూషకంబును
సుఖంబున నుండె. 24

క. నమ్మక పోరాదనుతఱి
నమ్మి రిపునిఁగలసి నమ్మనడచుట యొప్పన్
బిమ్మట నేమఱక తొలఁగి
నమ్మక యుండఁగవలయు నరవర వానిన్. 25

## ౧౫. కారణము లేనిపని చేయరాదు.

చ. ఒక నగరంబుచేరువ మ
హోన్నత దేవగృహంబు జీర్ణమై
వికలతనొంది యర్ధము భూ
విఁబడియుండఁగ దానిఁజూచి యు
త్సుకమతి నొక్క వైశ్యుఁ డది
తొల్లిటియందము నొందునట్లుగా
నకుటిలవృత్తిఁ జేయుఁడని
యర్థములిచ్చిన శిల్పకారులున్. 1

క. ఇయ్యకొని నగరుగట్టుచు
నయ్యెడ నొక చేవదూల మది పలకలుగా
వ్రియ్యుటకు నాఁడనాఁడను
జయ్యనఁ గీలము నుగాఁడఁ జఱచిన పిదపన్. 2

గీ. ప్రొద్దుచేరఁబడినఁ బోయిరిండ్లకు వార
లాసమీపతరుల నాశ్రయించి
తిరుగు మర్కటములు దేవాలయంబున
కవల నివల మెలఁగునట్టి యెడను. 3

సీ. గుడి యెక్కి తరులపైఁ గుప్పించునవియును
దరువులపైనుండి దాఁటునవియు
నుచ్చతరశాఖల నూఁగాడు నవియును
ప్రాకారములు ప్రాఁకి పాఱునవియు
గోపురంబులమీఁదఁ గూర్చుండునవియును
గోళ్ళఁ బ్రక్కలువీపు గోఁకునవియు
నిక్కుచు బొమలెత్తి వెక్కిరించెడునవి
యొండొంటితోఁ బోరి తోడునవియు

గీ. నిట్లు వానరయూథంబు లిట్టునట్టు
సహజమగు చాపలంబున సంభ్రమింప
వానిలోపల నొక వృద్ధవానరంబు
దూరముగఁ బాఱి తా విధిప్రేరణమున. 4

క. కీలాకీర్ణస్తంభము
నోలతనై నెక్కి నెఱియలో నండంబుల్
వ్రేలంగ రెండుకరముల
సీలం బెకలించి లావుచేఁ దిగియూఁగన్. 5

క. వీఁక వెఱచి నీలయూఁపిన
నగచర బీజంబు లిఁచుక సానొప్పిఁ గడన్
వెగఁ గొంది మొఱలువెట్టుచుఁ
డెగిమెఱ మర్కటము దాని త్రిమ్మట వింటే. 6

వ. కావునఁ దమకుఁ గారణంబు లేని పనికిం బొచ్చిన మానవు
లు పెక్కు చిక్కులకు లోనగుదురు. 7

---

## ౧౬. స్వయంకృతాపరాధము.



ఉ. కలఁ డిల దేవశర్మ యనఁ
గా నొకయోగి యతండు పెక్కు ది
క్కులఁ జరియించి నేర్పసఁగఁ
గూర్చిన యర్థము కంథలోపలం
బోలుపుగఁ బోసి వైచుకొని
పోవఁగ నత్తెఱఁ గెల్లఁ గాంచి మఱి
చ్చిలుటకు శిష్యభావమునఁ
జేరి యొకానొక ధూర్తుఁ డుండొగిన్. 1

గీ. నామ మాషాఢభూతినా నటన మెఱసి
కదిసి భయభక్తు లతనికిఁ గానఁబఱఁగఁ

బరమ విశ్వాస మొసఁగంగఁ బహులుచేసి
మెలఁగునంతటఁ దపసియు మిగులనమ్మి. 2

క. ఈకంథ నాకు వ్రేఁగని
చేకొన నాషాఢభూతిచే నిచ్చి యతం
డాకంచువ వనమధ్య త
టాకముఁ బొలుపారఁజూచి డాసికడంకన్. 3

క. ఆచమనం బొనరింపఁగ
నాచెరువ మేషయుగళ మత్యుగ్రముగాఁ
ద్రోఁచియును మస్తకంబులఁ
దాఁచియుఁ దమలోనఁబోరఁ దావ్వేళన్. 4

గీ. తగరుదోయి తలలు దాఁకంగఁ దాఁకంగఁ
బగిలిరక్త మొలికిపడుచు గట్టి
కరముకట్ట మాంసఖండంబుగాఁజూచి
ఫేరవంబు మిగులఁ జేరవచ్చి. 5

వ. ఆరక్తం బాస్వాదింపఁగోరి మేషయుద్ధమధ్యంబుని తలంప
నెఱుంగక దుర్బుద్ధియగు జంబుకంబు జిహ్వాచాపలంబునఁ
దద్రక్తం బుపయోగించు సమయంబున. 6

క. ముచుపాసి వెనుక వెచుకనుఁ
జనితాఁకుతగళ్ళపడుమాః జచ్చిన నక్కన్.
గనుఁగొని వగచుచు భిక్షుకుఁ
[illegible]నయఁగ నాషాఢభూతి నెలమిం గెలువన్. 7

వ. వాఁడంతకమున్న వసుభరితంబైన యాకంథ నపహరించి చనిననెఱింగి మోసపోయితినని భిక్షుకుండు గనమనంబున మేషయుద్ధమధ్యంబున జంబుకంబునకును నాషాఢభూతి వలనఁ దనకును ననర్థకంబులయ్యెననుచుం జింతించుచుం బోయె. 8

---

## ౧౭. వంచకుని వంచించియే శాస్తి చేయవలయును.

చ. గురుసరసీతటంబునకుఁ
గొక్కెరవృద్ధకుఁ డేఁగుదెంచి ని
ర్భర నియమవ్రతాచరణ
బావముదోఁపఁగ మోము వాంచి కం
ధరముఁ గుదించి కన్నుఁగవ
దార్కొనమూసిన దానిఁజూచి య
చ్చెరువునఁ గర్కటం బచటఁ
జేరి మృదూక్తుల నల్ల నిట్లనున్. 1

గీ. మిగులనాఁకంటివెల్లున నొగిలె నీవు
చిక్కియును మీనుగదిసినఁ జీరకునికి
యద్భుతంబయ్యెఁ జెప్పుమాయని కుళీర
మడుగ దానికి బకవిభుఁడనియెనపుడు. 2

సీ. ఏకాలంబులనైన నిట్టట్టు మెలఁగెడు
మీనుల భక్షించి మేనుపెంతుఁ
బెంచుచో నొకనాఁడు పిడుఁగుఁబోలెడువార్త
నాచెవినాటిన నాఁటనుండి
కడుపువిచారింపఁ గడువిచారంబునఁ
జిక్కితి నేమని చెప్పవాఁడ
ననినఁ గుళీరమేమని వింటివీ వన్నఁ
గొక్కెర కన్నీరు గ్రుక్కుకొనుచు
గీ. ననియెఁ గైవర్తులిచటికి నరుగుదెంచి
వలలు నూఁతలు మొదలుగావలయునట్టి
సాధనంబులుగొని జలజంతుకోటిఁ
బొరిగొనఁగవత్తు మనఁగను బోనఁగవింటి. 3

గీ. అని కుళీరంబుతో బకమపుడుపలుక
నచటిమీనంబులన్నియు నాలకించి
యోబకంబ మమ్మిందఱ నుద్ధరింపఁ
గలిగితివి నేఁటియాపద గడపవలయు. 4

వ. అనినంగొక్కెర యొకింతపొద్దు చింతించి మీకు నేఁ జేయం
దగిన కార్యంబెద్దియనిన నామత్స్యంబు లిట్లనియె. 5

క. ఇంకని జలములుగలిగిన
నింకొక్క యగాధసరసి నిడినం జాలుఁ

సంకోచింపక మము నీ
యంకిలి వాపుటకు నీవ యర్హుఁడ వెందున్. 6

వ. అనిన నాబకం బిట్లనియె జాలరుల వారింప నశక్తుండఁ గాని
మిమ్ము నొక్కొక్కరినె గ్రక్కున ముక్కునం గబళించు
కొని పోయి మీకు ననుకూలం బైన తావునఁ గ్రమక్రమం
బున నందఱను బెట్టి వచ్చెదననిన నవి సమ్మతించుటయు
నాబకంబు. 7

ఉ. ముక్కున నొక్కటిం గఱచి
మొక్కల మేమియు లేక పాఱి తా
నొక్కశిలాతలంబు పయి
నుండి రయంబున మెక్కి వచ్చి వే
ఱొక్కటిఁ గొంచుఁ బోయి యది
యుం దిని క్రమ్మఱఁ బాఱుతెంచి దా
నక్కఱ దీఱ మత్స్యముల
నన్నిటిఁ జంపెను గాంక్ష మీఱఁగన్. 8

వ. ఇట్లు క్రమక్రమంబునం గతిపయదినంబుల నాసరోవరం
బునం గల మత్స్యంబులనెల్ల భక్షించి మఱియుం దనివి
చనక మత్స్యంబుల వెదకుచున్న బకంబుం గనుఁగొని కర్క
టకం బొక్కటి కడియుం జనుదెంచి యిట్లనియె. 9

క. ఇమ్మడువు మీనములతో
నిమ్ములఁ గూడాడి పెరిఁగి యున్నాళ్ళను బ్రే

మమ్మునరుండితి నొంటిగఁ
గుఱిమ్మర లేనింక నన్నుఁ గొనిపోవఁగదే. 10

క. నావుఁడు గుళీరమాంసం
బే వెనుకను నమలియెఱుఁగ నిదినేఁడొసఁగెన్
దైవంబెయనుచు దానిని
వేవేగం గఱచిపట్టి విహగంబెలమిన్. 11

క. మును మత్స్యంబుల భక్షిం
చినయెడకుం గొంచుఁబోయి శిలపైఁదా వా
లిన మత్స్యమాంసమేదో
ఘనగంధం బెఱిఁగి యెండ్రి కడుఁజకితంబై. 12

వ. ఇద్దురాత్ముండు కపటోపాయంబున మీనంబులనెల్ల ని
చ్చోటవధియించెనని యెఱింగి తనలో నిట్లని వితర్కించె.

క. సాహసము లేనివానికి
నూహింపఁగ బ్రతుకుగలదె యొకట ధరిత్రిం
బాహువిజృంభితశత్రు
వ్యూహంబులఁజంపుఁ జచ్చునొండెఘనుఁడిలన్. 14

వ. అని మఱియుం గుళీరంబు దన మనంబున. 15

ఉ. ఏలొకొ యుద్ధభూమి నొక
యించుక నిల్చి జయంబుఁగైకొనన్
జాలుటలేక పాఱుదురు
చావు శరీరము దాఁచఁ దప్పునే

కాలవశంబుగాక యది
గానక హీనుఁడు పాఱుఁ బ్రాజ్ఞుఁడా
వేళ దొలంగిపో కనుభ
వించును నిందును నందు సౌఖ్యముల్. 16

వ. అదియునుంగాక. 17

సీ. వైరంబు కొఱగాదు వసుధ నెవ్వారికి
నట్టిది బలవంత మయ్యె నేని
తగిన సాహాయ్యంబు దలకూర్చుకొని పగ
సాధింపవలయు నుత్సాహలీల
బలముఁ గూడకమున్న పగతుండు తఱివేచి
కొదగొనిచిక్కించు కొనియె నేని
నోడుఁగక పగరపై నుఱికి చంపుటయొండె
రణమున వారిచే నణఁగుటొండెఁ
గీ. బాఱి కలకాల మెవ్వఁడు బ్రతుకునంచుఁ
బ్రాణసందేహమునఁ దెగుఁ బ్రాజ్ఞుఁడెఱిఁగి
సాహసము చేయ నాకును సమయమనుచు
నుఱికి కొక్కెర కంఠంబుఁ గొఱికి చంపె. 18

వ. ఇట్లు చంపి యాకులీరం బటకేనియుం జనియె. 19

## ౧౮. భుజబలముకంటె బుద్ధిబలమే ఘనము.



ఉ. ఉగ్రవనంబులోన హరి
యొక్క యొడ న్వసియించి సర్వస
త్వగ్రహణార్థియై బహువి
ధంబులఁ మాంసముఁ దించుచుండఁ ద
ద్వ్యగ్రతఁ జూచి జంతుతతు
లన్నియుఁ గూడి మృగేంద్రపాదప
ద్మాగ్రము లొంఁదల ల్గదియ
నార్తిమెయిం బ్రణమిల్లి యిట్లనున్. 1

ఆ. అవధరింపు మృగేంద్ర యడవిజంతుసమూహ
మిదె విన్నపంబున కేఁగుదెంచె
నెల్లన్న నన్నింటి నెసరేఁగి యొక్కటఁ
జలపట్టి యొకనాఁటఁ జంపనేల
నిత్య మొక్కమృగంబు నీకుఁ గట్టడగాఁగఁ
బ్రీతి నాహారంబు పెట్టఁగలము
సమ్మతింపు మనిన సకలజంతువులకు
నల్లకానిమ్మని యభయ మొసఁగి
ననుప నవి వోయి నిత్యకృత్యంబుగాఁగ
నుదయ మయ్యెడికాలఁదికి నొకటిఁ బంప

నది భుజించి హర్యక్షము ముదముఁ బొందు
నీవిధంబునఁ జిరకాల మేఁగునంత. 2

క. పులి కొలుకాఁడు గావున
నలయక వరుసెఱిఁగి వాని ననుపఁగ నొకనాఁ
డొలసి యొక చెవులపోతుకుఁ
గలయఁగ నిలువరుస యనుచుఁ గ్రొక్కనఁ జెప్పన్. 3

గీ. పలుకు విన్నమాత్ర ప్రాణంబు చలియింప
శశక మపుడు మూర్ఛఁ జాలఁ దూలి
తెలిసి కన్నుదెఱచి తృష్ణించి తలయూఁచి
దిగులుపుట్టి యాత్మ వగుల నొగిలి. 4

వ. ఆశశకంబు ముహూర్తమాత్రంబు చింతించి తెలివొంది
డెందంబు కొందలం బుడిపికొని వృద్ధుండయ్యును సాహసం
బుఁ దెచ్చుకొని తనలో నిట్లని వితర్కించె. 5

క. క్రూరమృగనిగ్రహాగ్ర
స్ఫారమహాబలము గేంద్రు సాహస మెసఁగన్
వారింతుఁ ద్రుంతు నొక్కఁడ
సారంబగు నాదుబుద్ధిచాతుర్యమునన్. 6

వ. అని మఱియుం దనమానంబున. 7

క. బుద్ధికి నశక్యమగు నది
యుద్ధాత్రిం గానఁగలదె యుఱవె గెలిచెడ నా

బుద్ధిబలంబున సింహము
నుద్ధతి యణఁగించి ప్రాణియుక్తికిఁ బాయన్. 8

క. అనుచుఁ దలపోసి యూశశ
మనుమానించుచును గదలునప్పటికి నినుం
డూ నభోమధ్యగతుం డగు
డు నతిక్షుత్పీడచేఁ గడుం గ్రోధముతోన్. 9

గీ. అవుడు గఱచి కంఠీరవం బార యివ్వ
నమున మృగములు నేఁడు గర్వమున నేచి
దినదినంబును నాకుఁ బుత్తెంచుమృగము
ననుప విది యేమొకో యనునవసరమున. 10

క. అడుగులు తొట్రుపడంగా
నడలొందినయదియుపోలె నయ్యెడలన్
బుడమిఁ బడి మొగ్గి లేచుచు
గడుసరి యగుశశక మొయ్యఁ గదియం బోవన్. 11

క. అప్పుడు చూచి మృగేంద్రుఁడు
నిప్పులు కనుదోయినుండి నెగయఁగ నోరీ
చొప్పడదు వేళదప్పిన
యప్పటియశనంబు నాకు నహితం బగుచున్. 12

క. అపరాహ్ణవేళ దాఁకం
గపటంబున నిట్లు తానికారణ మేమీ

విపరీతంబులు పుట్టెను
విపినంబున నున్న జంతువితతికి నెల్లన్. 13

వ. అని యివ్విధంబున రోషావేశంబునం బలుకుచున్నమృగేం
ద్రునకు సాష్టాంగదండప్రణామంబులు చేసి శశకం బిట్ల
నియె.

చ. కినియక చిత్తగింపు మొక
కీడును నాదెస లేదు శేడు సూ
ర్యుని యుదయంబువేళ నను
నొక్కమృగేంద్రుఁడు వచ్చి యడ్డగిం
చిన నిది యేల యేలిక భు
జింపఁగఁబోయెడి నన్నుఁ బోవని
మ్మనిన వనంబు జంతునివ
హంబుల కేలిక నేన కానొకో. 15

వ. అనుచుఁ బెద్దయుం బ్రొద్దతండు నన్ను దేవరసమ్ముఖంబు
నకుఁ బనివిననీక నిలిపి మఱియు నిట్లనియె. 16

క. నాకంటె నధికుఁ డెవ్వఁడు
నా కతనిం దెచ్చిచూపిన న్నిను మెత్తున్
లేకున్న నిన్నుఁ దున్ఙింతుం
గాకని యతఁ డప్పు డనుపఁ గడుభీతి మెయిన్. 17

క. ఆవిధ మెఱిఁగించుటకై
దేవర యున్నెడకుఁ బాఱు తెంచితి నీకుం

చేవలసినట్టి మృగమును
రా విడువం డనిన నతఁడు రభసంబెసఁగన్. 18

క. ఏవంక నుండు నాహారి
యేవేళకు నాకుఁ జిక్కు నేనేభంగిన్
భావించి యతనిఁ గదియుదు
నావుఁడు నాతనికి శశకనాథుం డనియెన్. 19

క. సింగం బాఁకలిగొని సా
రంగాది మృగాళి వెనుక రయమునఁ జనునీ
వంగీకరించి కతలును
వెంగలి మృగరాజుఁబట్ట వెఱపేమిటికిన్. 20

క. అను పలుకువిన్నమాత్రన
తన మదిఁ గ్రోధానలంబు దరికొన శశకం
బన కనియె నోరి! ముందఱ
వనమున వాఁడున్న దెసకు వడిఁ జనుమనుచున్. 21

సీ. ఆమృగేంద్రుండు మహాజవంబునఁ బొఱ
నతనిముందఱఁ దాను నతిరయమున
నెలయించి చెవులపోతెంతయు దూరంబుఁ
గొనిపోయి మున్ను చూచినయగాధ
జలములుగల నూఁప సన్నివేశంబున
నిలుచుండి నీశత్రునికి నివాస

యోగ్యంబు నెల విదె యూహించి దగ్గఱి
చూడుమాయనఁ దొంగిచూచునప్పు
డాత్మదేహంబు కూపజలాంతరమునఁ
గాంచి వేఱొకసింహంబుగాఁ దలంచి
కన్నుగానక పరాక్రమ్యంబు కతన నుఱికి
యపుడ మృతిఁబొందె దుర్బుద్ధియగుటఁజేసి. 22

వ. కావున నెంతటి బలవంతుడైనను బుద్ధిబలంబుననజేసి బు
ద్ధిమంతుండు గెలుచు. 23

౧౯. క్రూరులనడుమ సాధులు మననేరరు.

చ. అతుల మహాగ్రికాననము
నందు మదోత్కటనామసింహ ము
ద్ధతిఁ జరియించు దానికిఁ బ్ర
ధానులు కాకము పుండరీకముఁ
మతిగల జంబుకంబును గ్ర
మంబునఁ బంపొనరించుచుండి యొ
క్కతఱి నరణ్యదేశమునఁ
గాంచిరి యుష్ట్రము నిండువేడుకన్. 1

మ. కని నీ వెచ్చటనుండి వచ్చితనినం
గాకాది జంతుత్రియం
బునకున్ వందనమాచరించి యనియెన్
ముగ్ సార్థవాహుండు పీ
పున మోపింపఁగ మోసి డస్సి రొచటం
బోలేక దాఁగున్న వాఁ
డను మీ రేగతి నన్నుఁ బ్రోచినను వే
డ్కన్నిల్తు మీపొందునన్. 2

వ. అని పలికిన యుష్ట్రింబునకు జంబుకంబిట్లనియె. 3

క. ఈ కాన నొక మృగేంద్రుఁడు
చేకొని సామ్రాజ్యపదవిఁ జెన్నువహించున్
మాకతఁడు కులస్వామిగఁ
గైకొని సేవింతు మెల్లకాలము కడఁకన్. 4

క. నీవును మాలో నొకఁడవు
గావున మృగరాజు సమ్ముఖంబున నిడి నే
నీవిధముఁ దెలియఁబలికి శు
భావహమగుభంగి నీకు ననుసంధింతున్. 5

క. అనుటయు నా లొట్టియయును
దనమది ముదమంది వెంటఁ దగిలిన వానిం
గొనిచని మృగపతిముందట
వినయముతో నతని తెఱఁగు వినిపించుటయున్. 6

వ. ఆమృగేంద్రుఁడును నయ్యుష్ట్రంబు నభయవాక్యంబులఁ బ్రమోదం బెసంగం జేసి కథనక నామధేయంబిడి నాప్రా ర్థ్యామాత్యులలోని వాఁకండవై యుండుమని నియమిం చిన గోమాయు పుండరీక కాకంబులం గలిసి యతి స్నేహంబునఁ బెట్టకాలంబున్న సమయంబున నొక్కనాఁడు మదోత్కటుండు కాకవ్యాఘ్ర గోమాయూష్ట్రంబులం గనుంగొని యిట్లనియె. 7

ఉ. కల్యమునందు భక్ష్యమును
గానక మేను కృశించె రోగ ఛా
ర్బల్యము నాకుఁ గల్గుటను
భద్రగజేంద్ర శిరఃపలార బా
హుల్యము లేమి నుద్ధతికి
నోపక చిక్కితఁగాన దేహమై
కల్యము మాను నైవడి సు
ఖంబగు పథ్యముఁ దెచ్చిపెట్టుఁడీ. 8

వ. అని పలికిన మృగేంద్రునకు నన్నలువురు నేక వాక్యంబుగా నిట్లనిరి.

గీ. మీకుఁదగిన యాహారంబు మేము దెచ్చి
ప్రీతి నొకపూఁటకైనను బెట్టలేము
చాల నల్పులమగుట మాచంద మట్టి
దనిన మృగరాజు వారికి ననియె నప్పుడు. 10

క. ఏపాటి యశనమబ్బిన
నాపాటిం బ్రొద్దుఁగడపి యట్లుండెద నా
కీపాపపుఁ దెవులొదవెం
జూపోపక దైవమిట్లు సొంపడఁగించెన్. 11

క. వడిఁబోయి మీర లిప్పటి
కడిదికి నేమాంసమైనఁ గ్రిక్కునఁ గొని రం
డెడసేయక కనుచుఁ బనిచిన
గడువడి నలువురునుబోయి గహనములోనన్. 12

గీ. పొదలుచొచ్చి చూచి పుట్టలువీక్షించి
చెట్టుగుట్టమొదలు చేరికాంచి
గిరులు నదులు దొనలు బరికించి పరికించి
కాన నొకమృగంబుఁగాన లేక. 13

వ. కాక వ్యాఘ్రగోమాయూష్ట్రంబులు నలుదిక్కులకుం జెదరి
వెదకంబోయి కథనకుండు వెలిగా నొక్కచో ముగ్వురుఁ
గూడుకొన్న సమయంబునఁ గాకంబిట్లనియె.

గీ. స్వామిపనిపూనివచ్చిన చందమునకు
నడవిలోపల నేమియు నబ్బదయ్యెఁ
గంటకాహారుఁడైన యాకథనకాఖ్యు
నతని కాహారముగఁ జేయ ననువుగాదె. 14

వ. తచ్ఛేషంబును మనకుఁ గొన్నిదినంబు లుదరపోషణంబు
నకుం జాలు గతకాలంబున ననేక మృగమాంసంబుల ను

నలఁ బోషించిన రాజున కీసంకటంబుఁ బాపందగ దేయని నఁ గాకంబునకు నవి యిట్లనియె. 15

గీ. అభయమిచ్చి కరుణ నందఱికం బెను
విభవమిచ్చినట్టి విభుని మొఱఁగి
మనము వీనిఁజంప మదినెఱింగినయేని
నాగ్రహించి మనల నాజ్ఞచేయు. 16

క. పేరెఱుకమాత్రి నధిపతి
చేరువ నంతంతఁ దిరుగు చిఱుతనినైనం
గారించె నేని సచివుని
భారమణుఁడు గినియు వీనిఁబొసఁగున కంపక. 17

వ. కావున మనస్వామి యెఱుంగకయుండ నతనిఁ జంపుట కార్యంబు గాదనినఁ బుండరీక జంబుకంబులకుఁ గాకంబి ట్లనియె. 18

గీ. చావు తథ్యంబు మనకు విచారమేల
పెక్కు దివసంబు లాఁకటిపెల్లు కుడుచు
వారికి నెచ్చోట నేమియు దొరకదయ్యె
నరయ నింతకు దైవికంబట్లకాదె. 19

చ. మది నధికక్షుధార్తుఁ డగు
మానవుఁ డాలిని బిడ్డ నొల్లఁ డిం
పుదనర సర్పముం దనకుఁ
బుట్టిన యండములన్ భుజించు నె

ప్పుదజెగినట్టిచోటను బు
భుక్షితుఁడై దురితంబు చేయఁగా
మది దలపోయకుండునె ప్ర
మాదముపుట్టుఁ దొలంగిపోదమా. 20

వ. అనినఁ గాకంబునకు శార్దూలం బిట్లనియె మనస్వామి మహావ్యాధిపీడితుండును బుభుక్షితుండును నై యున్నయెడఁ దొలంగిపోవుట భృత్యన్యాయంబుగా దతని సమ్ముఖంబునకుం బోవుదమని కదలునంతం గథనకుండుం గూడుకొన్న నన్నలువురుం జని సింహంబు బహిర్ద్వారంబునఁ గథనకుని నిలిపి మువ్వురుంజని మదోత్కటునకుం బ్రణమిల్లి యిట్లనిరి. 21

గీ. అధిప గిరిగహ్వరముల కుగాత్రిటవులకు
నరిగి యామిష మబ్బక తిరిగితిరిగి
చిక్కితిమి నీవు చిక్కి నశింపనేల
విన్నవించెద మేమొక వెరవు వినుము. 22

గీ. కథనకుండు మిమ్ముఁ గార్యార్థియై వచ్చి
కొలిచినాఁడు గాని నిలువ లేదు
వాఁడు నీకు మాకు వలయుభోజన మగుఁ
బ్రియము వదలి మట్టుపెట్టితేని. 23

వ. అని కాకంబు పలికిన విని మృగేంద్రుండు కర్ణస్పర్శపూర్వకంబుగా హరిస్మరణంబుసేయుచు నభయవాక్యంబులా

సంగి కలిపించుకొని యిట్లు సేయందగునే వినుమని యి
ట్లనియె. 23

ఉ. ధనదానంబును నన్నదానమును గో
దానంబు భూదానమున్
విను మిట్టీ యభయప్రదానమునకు
న్నిక్కంబు తుల్యంబులా
ననరా దీయెడ నశ్వమేధ మఖపు
ణ్యంబున్ భయభ్రాంతుఁగా
చిన పుణ్యంబునఁ బోలదంచు సుజనుల్
చెప్పంగ వింటిం దగన్. 24

వ. అనిన గాకం బిట్లనియె. 25

గీ. కులముకొఱకువిడుచుఁ గొఱగానిపుత్త్రునిఁ
గులమువిడుచు నూరునిలుపుకొఱకు
భూమికొఱకువిడుచు బోరనగ్రామంబు
ధాత్రివిడుచు నృపుఁడు తనకుఁ గాను. 26

వ. కావున మేమందఱముం గలిగియుఁ బ్రయోజనంబులేదు
సకల జంతురక్షకుండవగు నీశరీరంబు నిలిచినంజాలు నా
దేహంబీపూఁట కాహారంబుసేయ నవధరింపుమని వాయ
సంబు పలికిన విని మృగపతి యూరకున్నయెడ లబ్ధావకా
శుడై తక్కిన మువ్వురుం గూడుకొని యతనిముందఱ ని
లిచియుండ వాయసంబు మఱియు నిట్లనియె.

గీ. తప్పుఁజూచి నన్ను నొప్పింపఁజాలవు
చాలకున్న నేనచత్తు నాశ
రీరమాంసమిపుడు ప్రియమున భక్షింపు
మనఘ నాకు దీన నగుముదంబు. 27

వ. అనినం గాకంబునకు సింహం బిట్లనియె. 28

గీ. అల్పమాంసమిందు నాప్యాయనముగాదు
వట్టిహింస నాకుఁ గట్టనేల
యనిన నాలకించి యమ్మృగేంద్రునితోడ
జంబుకంబు పలికె సౌమ్యఫణితి. 29

క. నాదేహము నీకిచ్చితిఁ
గాదనక భుజింపు స్వామికార్యముసేయం
బ్రోడిగల నాకు నిదె నీ
పాదంబులె దిక్కుసూవె పరమార్థముగన్. 30

వ. అనిన విని మదోత్కటుండు కాకంబుతోడఁ బల్కినట్ల
యమ్మృగధూర్తంబునకుం బ్రత్యుత్తరంబిచ్చినఁ బులి కది
యుం జనుదెంచి సాష్టాంగ నమస్కారంబుచేసి వినయపూ
ర్వకంబుగా నిట్లనియె. 31

క. ఎవ్వరు నేఁటికి నామెయిఁ
గ్రొవ్విన మాంసంబు గలదు కొను మాఁకలియున్
నొవ్వియును దీఱు నంతట
నవ్వల నారోగ్యమగు మృగాధిప నీకున్. 32

వ. అని శార్దూలంబు పలికిన మృగేంద్రుం డిట్లనియె. 33

ఉ. గోవుల విప్రులం దఱిమి
కూడక ముట్టి భుజించు తచ్ఛరీ
రావృత మాంసపోషణము
సం దనిశంబును మేను పెంచుటన్
గా విటువంటి కల్మషవి
కారపు మేనులు భక్ష్యభోజ్యముల్
నీవు దొలంగు మాఁకటికి
నేఁడును నోర్చెద వ్యాఘ్రపుంగవా. 34

వ. అని మదోత్కటుండు పలికినఁ బుండరీకంబు సలజ్జావనత
వదన ఖిన్నత్వంబునం దొలఁగి చనినఁ దదనంతరంబ కథ
నకుం డతనిం గడియంజని మచ్ఛరీరంబున భవదాత్మరక్ష
ణంబు గావింపందగునన్న వక్షణంబ. 35

క. వడినుఱికి లొట్టిపిట్టను
మెడఁగోఱలఁ గఱచిపట్టి మేదినిమీఁదం
బడఁదిగిచిన శార్దూలము
నొడఁగూడిన నక్క తాను నుదరము వ్రచ్చెన్. 36

వ. వ్రచ్చి తచ్ఛరీరమాంసంబు మృగపతికిం బెట్టి తచ్ఛేషంబు
గోమాయు వ్యాఘ్ర కాకంబు లనుభవించె. 37

## ౨౦. పాపము బద్దలుగాకమానదు.



ఉ. పొందుగ దుష్టబుద్ధియు సు
బుద్ధియు నాఁగ వణిక్కుమారు లా
నందముతోఁ జరింప నొక
నాఁడొకచోట సుబుద్ధిగాంచెఁ బెం
పొంద సొనారిటంకముల
నుంచిన కాంచనకుంభ మట్టి యా
కుందన మొక్కచోట నిడి
కూర్చిన కోమటిఁ జేరిచెప్పెఁ దాన్.
సీ. చెప్పవారిరువురు శీఘ్రింబచని రాత్రి
గొనివచ్చి తమపురంబునకు వెలిని
వృక్షమూలంబున వెలయ నిక్షేపించి
వెచ్చంబునకుమున్న పుచ్చినట్టి
నిష్కంబులిరువురు నెఱయవిభాగించు
కొని తమ యిండ్లకింపొనరఁబోయి
ప్రకటిత స్నేహసంపదఁబొంది యిరువురు
తొలఁగక మెలఁగంగ దుష్టబుద్ధి
గీ. తనదు చిత్తంబునందుఁ దద్ధనముఁదాన
యపహరించిన నంతయు నబ్బుననుచుఁ

దలఁచి యొక్కనాఁడొంటిగాఁ జానయరిగి
పెచ్చి యాభిందె వేగంబ పెల్లగించి. 2

క. కొని తెచ్చి యతిరహస్యం
బున నొకచోఁ బాఁతి దుష్టబుద్ధి సుబుద్ధిం
గని పలికె నాఁడు దాఁచిన
ధనమిండ్లకుఁ దేక మనకుఁ దడయఁగ నేలా. 3

క. అతిధార్మికుండు నరపతి
చతురుఁడు మంత్రియును బ్రజలు సజ్జను లగుటన్
మతిఁ దలఁక నేల మనకిది
సతతముగఁ జేకూడెఁ బసిఁడి సర్వము ననుచున్. 4

వ. పలుక వైశ్యకుమారు లిరువురుంజని తరుమూలంబున ని
డిన నిక్షేపంబు పుచ్చుకొనుటకుం ద్రొచ్చిచూచి యప్పు
డచ్చోటఁ బసిండి గొనిపోయిన తద్ధాతంబుపలక్షించి
యొండొరులమీఁద నవిశ్వాసంబునొంది వివాదంబుసేయు
చు నప్పురంబు మహీశ్వరసమ్ముఖంబునకుం జని యత్తె
అంగెఱింగింప నతండును ధర్మాధికారులఁ దీర్ప నియోగిఁప
వారలును బంచదినపర్యంతంబు మీలోనం దెలిసిరండని
యనిపినం జని షష్ఠదివసంబునఁ బ్రభాతంబున నయ్యిరు
వురుం బాడచూపి నిలిచినప్పుడు దుష్టబుద్ధి ధర్మాధికా
రుల కిట్లనియె. 5

మత్తకోకిల. పూని దీని విచారమేల సుబుద్ధితో నె హరించితిమో
యాన దానికిసాక్షి యచ్చట నంచితంబగువృక్షమే
కాని మానిసిఁ జెప్పఁజెప్పినఁ గల్లపెట్టెఁడు నన్ను న
న్నానితాత్మకులార మీరలు నాకుదిక్కని మ్రొక్కినన్.

క. వెఱఁగుపడి వారలందఱు
నెఱయఁగ నొండొరులఁజూచి నేఁడాశ్చర్యం
బెఱుకపడఁ దరులచేతను
వఱలఁగఁ బలికించు నట్టివారలుఁగలరే. 7

వ. అనుచు ధర్మాధికారులు వైశ్యకుమారుల కిట్లనిరి. 8

గీ. పొద్దులేదు నేఁడుపోయి ప్రాతఃకాల
వేళ రండు పొండు వేగమనిన
నరిగి దుష్టబుద్ధి యాత్మీయజనకునిఁ
బ్రార్థనంబుచేసి పలికెనపుడు. 9

సీ. తండ్రి యీహస్తగతంబైన యర్థంబు
నెట్టివానికిఁ బాలువెట్టనేల
వాఙ్మాత్రమున నీకు వశమైన పనిగానఁ
జెప్పెద నామాట చిత్తగింపు
వృక్షకోటరము ప్రవేశించి యీరాత్రి
నీవదృశ్యంబుగా నిలుచునంత
ధర్మాధికారులంతట రేపకడవచ్చి
యచటివృక్షము సాక్షియడుగఁదడవ

గీ. యిద్ధనంబు సుబుద్ధి గ్రహించెఁగాని
దుష్టబుద్ధికిఁ బనిలేదు దృష్టమనుచు
నీవు పలికిన నది తీఱిపోవుఁ బిదప
మనకుఁ గలకాల మెల్లను మనుట గలుగు. 10

వ. అనిన విని దుష్టబుద్ధికిఁ దజ్జనకుం డిట్లనియె. 11

చ. చెడుతరవాయి నిట్టిపని
చెప్పితిగాని ధనంబు కాంక్షకున్
గడపలలేదు హీనమతి
గప్పినవానికి దుష్టబుద్ధి నా
నుడువఁగనున్న నిన్నిటు త
నూభవుఁగాఁ గనునట్టి పాపపుం
జెడుగగు నాకు దుర్లభమె
చెప్పెడునారకబాధ పుత్రకా. 12

వ. అని పలికి మఱియు నిట్లనుఁ బ్రాజ్ఞుం డుపాయంబుచింతించి పిదప నపాయంబునుం దలంపవలయు నని చెప్పిన తండ్రి పలుకులు గైకొనక దుష్టబుద్ధి లోభాక్రాంతుండై బలాత్కారంబున నతని నొప్పించుకొనిపోయి నిశామధ్యంబునఁ దత్తరుకోటరంబున నిలిచి ప్రభాతసమయంబున. 13

సీ. ఆదుష్టబుద్ధి ధర్మాధికారులఁబిల్చి
కులముపెద్దలఁ గూర్చుకొనికడంగి

ధర్మబుద్ధియుఁదోన తడయక చనుదేర
నావృక్షమునకు సాష్టాంగమెరఁగి
సత్యంబుపలుకుము వృక్షమ సాక్షివీవన్నఁ
బూని వనస్పతిలోననుండి
ధర్మబుద్ధి మొరంగి ధనముఁగైకొనెఁగాని
పుచ్చుకోఁడీదుష్టబుద్ధి యన్న
వాగ్విలాసంబు వినఁబడ్డ వారలెల్ల
వద్భుతంబంది కనుఁగొను నంతలోన
మ్రానుపలికినచోటు దా మహినెఱింగి
పాటిమాలి యసత్యంబు పలికెననుచు. 14

వ. ఆధర్మబుద్ధి యంతరంగంబునఁ గోపోద్దీపితుండై. 15

సీ. కుజము వెసనెక్కి యామీఁది కొమ్మలరసి
తోలఁగ వీక్షించునపుడొక తొఱ్ఱఁగాంచి
యింగలంబును బూరియు నెసఁగఁదెచ్చి
కోటరంబునఁబైచి యచ్చోటుదోలఁగ. 16

క. అనలజ్వాలాజాలము
తనదేహము చుట్టుముట్టఁ దల్లడపడుచున్
మునుకొని మొఱ్ఱలువెట్టుచు
జనములపై దుష్టబుద్ధి జనకుఁడువడియెన్. 17

గీ. పడిన నెట్టిఁజూచి పైఁబడి ధర్మాధి
కారులెల్ల బ్రిమసి కదిసి యడుగ

సుతుఁడు దుష్టబుద్ధిసుండు నన్నిటువంటి
యుడుకు చేసెననుచు నుసురువిడిచె. 18

వ. విడిచినంజూచి ధర్మాధికారు లత్తెఱఁగంతయు మహీకాంతు
నకుం జెప్పిన నతండు దుష్టబుద్ధిం గొఱుతవేయించి వాని
సర్వస్వంబునుం జూఱగొనియె. 16

